## రచయిత గ్రంథాలు మరికొన్ని

| | |
|---|---|
| మనం దేనికి బానిసలం ? | వ్యాస సంకలనం |
| తల్లే పిల్లను చంపితే ? | వ్యాస సంపుటి |
| విముక్తి ఉద్యమాలు : మహనీయులు | వ్యాస మంజరి |

## అచ్చులో

| | |
|---|---|
| క్రైస్తవ స్త్రీల స్థితి | పరిశోధనాత్మక పరిశీలన |
| మహిళోద్యమం : మహిళా సంఘాలు | ,, |
| సామ్రాజ్ఞి రుద్రమదేవి | బాలల నవల |
| ఈ దేశం నాదేనా ? | నవలిక |
| నవోదయం | నవల |

## రాబోవు రచనలు

వివాహ వ్యవస్థ

స్త్రీలు : లైంగిక సమస్యలు

**Women : Tradition & Culture**
**(Translation)**

# భావ వాహిని

## ( హేతువాద వ్యాసాలు )




మల్లాది సుబ్బమ్మ



ప్రజాస్వామ్య ప్రచురణలు [ప్రై] లిమిటెడ్
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం,
హైదరాబాద్ - 500 028

ప్రజాస్వామ్య ప్రచురణలు నెం. **23**

# భావ వాహిని

రచన : మల్లాది సుబ్బమ్మ

ప్రథమ ముద్రణ 1983
ప్రతులు 1000


వెల :- : రు. **5-50**

పబ్లిషర్సు :-
ప్రజాస్వామ్య ప్రచురణలు [ప్రై] లిమిటెడ్,
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం
హైదరాబాద్ - 500 028

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :-
వికాసం
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం
హైదరాబాద్ - 500 028

ముద్రణ :
లిబర్టి ప్రింటర్సు
చీరాల - 523 155

# విషయ సూచిక

కృతజ్ఞత

స్వవిషయం | పుట

ఇరాన్‌లో స్త్రీల ఇక్కట్లు 1

స్త్రీలు - సంస్కృతి : సంప్రదాయం 5

దేవుని పుట్టుపూర్వోత్తరాలు 13

నీతికి ప్రాతిపదిక ఏది? 18

ఏసుక్రీస్తు బోధలు 23

క్రైస్తవం : రోమను కేథలిక్‌శాఖ 33

క్రైస్తవం : ప్రొటెస్టెంటుశాఖ 39

మత దృష్టిలో మహిళ 43

ఏసుక్రీస్తు వ్యక్తిత్వ పరిశీలన 47

మనము : మన సంస్కృతి 50

హేతువాదం : ఎందుకు ? ఎవరికి ? 57

తల్లుల్లో వైజ్ఞానిక దృక్పథం 61

# కృతజ్ఞత

ఈనాటి సమాజంలో మూఢ విశ్వాసాలు, అవిద్య, అజ్ఞానాలు ప్రబలంగా వున్నాయి. 'బుద్ధి కర్మానుసారిణీ, అంటూ విధిచేతిలో కీలు బొమ్మలనే అనాగరిక భావం సర్వత్రా గోచరిస్తోంది. విద్య నేర్చినవారు, పరిపాలకులు, ఉపాధ్యాయులు, ఉన్నతోద్యోగులైన పురుషులే ఇలాంటి గాఢ తిమిరాంధకారంలో కొట్టుమిట్టాడుతుంటే ఇక తరతరాల భావ దాస్యంలో మగ్గుతున్న స్త్రీల విషయం ఏమని చెప్పాలి ! ఎలా చెప్పాలి ! అందువల్లే నానాటికి మనలో దురభిమానాలు, హెచ్చుతగ్గులు, జాత్యహంకారం, కుల మత భేదాలు, అవినీతి విలయతాండవం చేస్తున్నాయి. మన నాగరిగత 20వ శతాబ్దంలోవుంటే మన సంస్కృతి 16వ శతాబ్దాన్ని అధిగమించటం లేదు. సాంఘిక, ఆర్థిక రాజకీయ రంగాలలో అశాంతి, అక్రమము, అన్యాయము జీర్ణించిపోయాయి. సమాజానికి, కుటుంబానికి కీలకమయినది స్త్రీ పాత్ర. ఆమె హోదాను, స్థాయినిబట్టి సమాజ ప్రగతిని అంచనా వేయవచ్చు. అలాగే ఆమెలోని అభ్యుదయ, వికాసాల ద్వారా సమాజాన్ని మార్చవచ్చుననే ధ్యేయంతో ఈ వ్యాసాలను ప్రచురించడం జరిగింది. నా యీ రచనలవల్ల ఏ ఒక్క మహిళ మారినా, ఏ యువతిలో హేతువాద భావాలు ప్రోదిచేసుకున్నా నాకదే తృప్తి; నాశ్రమ ఫలించినట్లే, నా కోరిక నెరవేరినట్లే.

ఇందులో వ్యాసాలుకొన్ని, 'HONEST TO MAN'అనే గ్రంథంలోని భావాల ప్రభావానికి లోనై వ్రాసినవి. 'హేతువాది' 'నాస్తికయుగం' లాంటి పత్రికలు 'హేతువాద దర్శిని' లాంటి గ్రంథాలలో నా వ్యాసాలు ఇందులో చేర్చడంజరిగింది. వారందరికి నా కృతజ్ఞతలు. సందర్భోచితంగా తగు సలహాలనందించిన నా జీవిత భాగస్వామి, సహకార్యకర్త శ్రీ ఎం. వి. రామమూర్తి గారికి నేను ఋణపడి వున్నాను.

రచయిత

మల్లాది సుబ్బమ్మ

# స్వవిషయం

"ప్రజాస్వామ్య ప్రచురణలు" ఒక వినూత్న ప్రయత్నం. ఇతర సంస్థలతో రూపసామ్యం వున్న ఆదర్శాలలో, లక్ష్యసాధనా విధానాలలో, కార్యాచరణ రీతులలో భిన్నమైనది.

వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో అన్ని రంగాలలో ప్రజాస్వామ్యం వెల్లివిరిసి మూడు పూవులు, ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఈ సంస్థ అభిమతం, ఆశయం కూడాను.

ఇలాంటి ప్రయత్నాలు పూర్వం జరిగినవి. ప్రస్తుతం జరుగు చున్నవి. కాని, వానికీ-ఈ ప్రయత్నానికీ తారతమ్య మున్నది. ఉదాత్త మయిన ఆశయాలతో, ఉత్తేజంపొందిన మేధావుల సమిష్టి సహకార కృషి ఫలితంగా ఈ సంస్థ ఉద్భవించింది.

విశ్వ జనీనతే దీని విశిష్టత. మొత్తం మానవ ప్రపంచ సంస్కృతీ సాహిత్యాలు దీని వారసత్వం. ముఖ్యంగా భారతదేశ సంస్కృతిలో ఇంత వరకు మరుగున పడిన మాణిక్యాలు—చార్వాక, కపిల, కణాదుల మతాలు, సిద్ధాంతాలు దీని సొమ్ము. తెలుగుదేశమే కాదు, తెలుగు భాష విస్తరించిన ప్రాంతమంతా దీని కార్యక్షేత్రము.

ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏ కాలమందు జరిగినా, అవన్నీ దీనికి అధ్యయన యోగ్యాలే. ఇంగ్లండులో 1689లో బ్రిటిష రాచరికానికి పరిమితులు, హద్దులు విధించిన విప్లవం: అమెరికాలో 1776 లో ప్రాతినిధ్యాధికారమున్నవారే పన్నులు విధించగల హక్కుదారులనే 'ప్రజాస్వామ్యం' సూత్రాన్ని ఎలుగెత్తి చాటిన విప్లవం: 1789 లో స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము ఆదర్శాలుగా విజయవంతమయిన ఫ్రెంచి విప్లవం; 1917 లో 'భూమి, తిండి, శాంతి' నినాదాలతో కార్మికవర్గం, మధ్య తరగతి రష్యాలో సాధించిన విప్లవం: 1947 లో భారతదేశం పొందిన స్వాతంత్ర్యం; 1949లో కర్షకబలం చైనాలో జరిగిన విప్లవం మొదలయిన చారిత్రాత్మక సంఘటనలను లోతుగా, సునిశితంగా, సమ్యక్‌దృష్టితో పరిశీలించి తదనుగుణమైన ప్రచురణలు చేయాలని ఈ సంస్థ ఆదర్శం.

సామాజిక పరివర్తనకూ, భావగమనానికీ అవినాభావ సంబంధ మున్నదనే విషయం జగద్విదితం. అయితే భావాలు ప్రాతిభాసికాలేనా

లేక మానవ మస్తిష్కములో ఉదయించిన తరుణం నుంచీ ప్రత్యేక గమన సూత్రాలతో స్వతంత్ర లక్షణాలు కలిగి పెంపొందుచున్నవా? రెండవ స్వరూపం అవశ్య పరిగ్రహణయోగ్యం. ఈ సూత్రాన్ని విశ్వవిఖ్యాత విప్లవవాది, మేధావి అయిన యమ్. ఎన్. రాయ్ 1946 లో ప్రవచించాడు. ఈ భావన యీ సంస్థకు జీవగర్ర.

వ్యక్తివాదం, హేతువాదం, మానవవాదం ఈ సంస్థను శాసించే త్రికము (త్రిగుణాలు). మానవులంతా ఒకటే; మానవ సమాజానికి మూలం మానవుడే; మానవుని అభ్యున్నతియే మానవ సమాజ అభ్యుదయానికి, శ్రేయస్సుకు కొలమానం లేక వరుమానం; ప్రకృతి నియమబద్ధమైనది కనుక ప్రకృతినుంచే ఉద్భవించిన మానవుడుకూడా వస్తుతః నియమబద్ధుడు అంటే హేతువాది. కనుక అతడు నీతివంతుడుగా మనగలడని ప్రకటించిన రాడికల్ హ్యూమనిజం యొక్క తాత్విక సిద్ధాంతం ఈ సంస్థకు వెలుగుబాటగా అడుగడుగునా ప్రభావితం చేస్తుంది.

మానవవాదం యీనాటిది కాదు. మానవజాతి సహజంగా మనుగడ సాగించినప్పటినుంచీ యీ తాత్విక చింతన జరుగుతూనే వచ్చినది. కాని ఆధునిక యుగంలో మానవ విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందటంతో ప్రస్తుతం నూతన భాష్యాలతో, వినూత్న విషయ పరిజ్ఞానంతో ఆ పాత కాలపు మానవవాదాన్ని పరిశీలించి, సవరించి, పునరుద్ధరించవలసిన అవసరమేర్పడినది. ఆకృషి ఫలితమే యమ్.ఎన్.రాయ్ నవ్యమానవవాదం.

స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ మానవ మనుగడ ప్రేరకాలని పేర్కొనటం ఈ నవ్యమానవవాద విశిష్టత. (1) అంతరాత్మ ప్రేరిత నీతి లేక దైవ నిర్దేశిత నీతి: (2) ప్రయోజనాత్మక నీతి; అనే రెంటికీ ప్రత్యామ్నాయంగా హేతుబద్ధమయిన నీతిని చాటిచెప్పినది. రాజకీయరంగంలో పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించినది. ఆర్థిక రంగంలో సహకార సంబంధమయిన ప్రణాళికా రచనలను రూపొందించినది. సాంస్కృతిక రంగంలో భావ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించినది. సాంఘికంగా కుల, మత, వర్గ, లింగ, ప్రాంతీయ, భాష, జాతి, దేశ విభేదాలను నిరసించినది; విశ్వజనీయ సంస్కృతికి విలువనిచ్చినది. ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగల్గినది. అంధ విశ్వాసాలకు గొడ్డలి పెట్టు. ప్రబోధ కార్యక్రమాలను బలపరుస్తుంది. అందులో ఒక భాగమే ఈ సంస్థ ప్రచురణ యత్నం.

ఈ ప్రకృతికి అతీతమయిన మరే యితర శక్తి లేదని తెలుసుకొనటం తన మనుగడకు, భవిష్యత్తుకు తానే బాధ్యుడనని గుర్తెరగటం, తన క్షేమానికీ, అభ్యున్నతికీ, తోటి మానవుల శ్రేయస్సుకూ వైరుధ్యంలేదనే విషయాన్ని గ్రహించి సమాజ స్థితిగతులను మెరుగు పరచటానికి ఉద్యుక్తుడు కావడం ఉత్తమ మానవలక్షణం.

ఈ మానవవాద లక్ష్యాలనే 1952 లో నెలకొల్పబడిన అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంఘం మరోరూపంలో ప్రకటించినది. భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘాన్ని ఆ ప్రపంచ సంస్థ గుర్తించి పూర్తి సభ్యత్వాన్నిచ్చినది. ఆ అంతర్జాతీయ సంఘం ఐదు ఖండాలలోని అనేక దేశాలలో అనుబంధ సంస్థలు కలిగి అసమానమైన కృషి సాగిస్తున్నది.

ప్రస్తుతం ప్రపంచ మానవాళి సాంస్కృతికంగా విషమస్థితిలో చిక్కుకొని యున్నది. ఒకవైపు మత ప్రాబల్యాలు, మరోవైపు ఫాసిజం, కమ్యూనిజంలాంటి నియంతృత్వ విధానాలు చలామణీ అవుతూ ప్రజల సంక్షేమం కొరకు ప్రజల ఆశయాలను నెరవేర్చకపోగా హీనస్థితికి దిగజార్చుచున్నవి. దీని ఫలితంగా తృతీయ మార్గాన్వేషణ ప్రారంభ మయినది. విజ్ఞానం పెరుగుదల, మానవ మేధస్సు-సృజనాశక్తి అభివృద్ధి చెందడంతో నూతన తాత్విక చింతనలకు ప్రాతిపదిక ఏర్పడినది.

దీనినే నైతిక హ్యూమనిజం అని పిలవటం కూడా కద్దు. ఇది ప్రజాస్వామ్య సూత్రానికి కట్టుబడి వున్నది. ప్రతివ్యక్తీ సాధ్యమైనంతగా వికాసం పొందటానికి హక్కు కలిగి యున్నాడు. కేవలం ప్రభుత్వ పరిధిలోనేగాక జీవిత సంబంధాలన్నింటిలోనూ, ఈ ప్రజాస్వామ్య సూత్రం వర్తిస్తుంది. విజ్ఞానాన్ని మానవ వినాశనానికి కాక క్షేమానికి, శ్రేయస్సుకు, నిర్మాణయుతంగా వినియోగించటం ఈ సిద్ధాంతపు ఆదర్శ ముఖ్య లక్షణాలలో ఒకటి. విజ్ఞానము లక్ష్యాలను నిర్దేశించదు. మానవ శ్రేయస్సును సాధించటానికి అనువైన మార్గాలను సూచిస్తుంది.

హ్యూమనిజం నైతిక దృక్పథం కలది. మానవుని హుందాతనాన్ని, సాధ్య మైనంతలో ప్రతివ్యక్తి ఇతోధికంగా ఇతరుల హక్కులకు భంగం కలుగని రీతిగా స్వయంగా వికాసాన్ని పొందగల హక్కును గుర్తిస్తుంది. సామర్ధ్యం, క్రమశిక్షణ పేరుతో మానవ జీవితాన్ని యాంత్రికం చేసే వ్యవస్థను వ్యతిరేకిస్తుంది. యాంత్రీకరణ మానవ విలువలను వమ్ము చేస్తుంది. కనుక, తాత్కాలిక లక్ష్యాలను సాధించే ప్రయత్నంలో సమగ్ర

నియంతృత్వ సిద్ధాంతాలు అమలుపరచ జూచే సమగ్ర యాంత్రీకరణను త్రోసి రాజంటుంది. సమాజం యెడ బాధ్యతతో సమ్మిళితమైన వ్యక్తి స్వేచ్ఛను లక్ష్యంగా స్వీకరిస్తుంది. భౌతిక అవసరాలను తీర్చటం, భౌతిక పరిస్థితులను మెరుగుపరచటం అనే పేరుతో పైన పేర్కొనబడిన వ్యక్తి స్వేచ్ఛను త్యజించ నిచ్చగించదు. మానసిక స్వేచ్ఛ, మౌలిక చింతన లేనప్పుడు అభ్యుదయం అసాధ్యం.

పిడివాదాన్ని, పిడివాదపు సిద్ధాంతాన్ని త్రోసిరాజని హర్యామనిజం స్వేచ్ఛను ప్రబోధిస్తుంది. నైతిక విలువలను, సృజనాశక్తులతో సమ్మిళిత మైన జీవిత విధానాన్ని, వ్యక్తి వికాసాన్ని లక్ష్యంగా అంగీకరిస్తుంది. మారుచున్న సమాజానికి అనుగుణంగా అభ్యుదయ పథంలో అనుసరించ దగిన మౌలిక జీవిత సూత్రం ఇది.

విజ్ఞానాన్ని ప్రపంచ శాంతి కొరకు వినియోగించ గలిగితే ప్రస్తుత విషమ స్థితినుంచి మానవాళి విముక్తి చెందగలదు. భయవిముక్తుడైన మానవునివరిపూర్ణ వికాసానికి పరిమితులుండకూడదు. ఈ తాత్త్విక ఆలోచనా రీతిని మానవ ప్రపంచం ప్రస్తుతం ఎదుర్కొనే సవాలుకు సరియైన జవాబుగా భావించవచ్చును.

ఇలాంటి తాత్త్విక ధోరణి స్వేచ్ఛా భావుకతను పోషిస్తుంది. కనుక అన్ని సామాజిక రంగాలలోను వినూత్నమయిన రీతిలో స్వేచ్ఛను పెంపొందించి అభ్యుదయ మార్గాన అడుగుల వేయించగల నూతన భావాన్వేషణయే 'ప్రజాస్వామ్య ప్రచురణల సంస్థ' ధ్యేయం.

అట్టి భావాలను ప్రజాబాహుళ్యానికి ఎరుకపరచటం ఈసంస్థ ప్రథమ కర్తవ్యంగా భావిస్తుంది. ఇది సాహసమే కావచ్చు. ప్రమాదభరితం కూడా కావచ్చు. కాని లక్ష్యసాధన కొరకు చేసే ఇట్టి కృషిని విస్మరించ జాలము. ఈ ప్రయత్నానికి, వ్యాపారానికి స్వేచ్ఛాపిపాసకల వ్యక్తు లందరి సానుభూతి సహకారాలను అర్థిస్తున్నాము.

సభ్యులు : శ్రీ ఎం. వి. రామమూర్తి
శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి
శ్రీ గుంటువల్లి గోపాలరావు
శ్రీమతి మల్లాది సుబ్బమ్మ
శ్రీ గురిజాల సీతారామయ్య
శ్రీ కొల్లా సుబ్బారావు

ఎం. వి. రామమూర్తి
అధ్యక్షుడు
బోర్డు ఆఫ్ డైరెక్టర్స్

# ఇరాన్‌లో స్త్రీల ఇక్కట్లు

"TAKE THE VEIL OR GO TO HELL" మత దురహంకారి, మానవతా విద్వేషి, అపరమనువు ఖొమేని పాలనలో ఇరాన్ స్త్రీల కిచ్చిన హోదాయే ఈ పిలుపు. తమ మతం మహోన్నతమైనదని భావిస్తున్నారు ముసల్మాన్ మతగురువులు. ఖురాన్‌లోని నియమాల్ని పాటిస్తున్నామని గర్వంగా చెప్పుకుంటున్నారు ముస్లిం దేశాధినేతలు. ఇస్లాం మతంలో ఆది నుండి మతమూ, రాజకీయాలూ పెనవేసుకొని వున్నాయి. మతాధికారులైన ఖలీఫాల ఎన్నికలో సైతం హింసా, హత్యలు ప్రముఖ పాత్ర వహిస్తాయి. అసహజమైన హింసా దౌర్జన్యాలతో అధికార ప్రాబల్యం పెంచుకుంటారు. "నాకు విధేయులుగా వుండేవారు మాత్రమే దేవునికి నమ్మిన బంట్లు" అనేవాడు మహమ్మదు. అలాగే రాజ్యాధికారాన్ని మించిన దైవత్వాన్ని ఆపాదించుకొన్న చండ శాసకుడు ఖొమేనీ. ఇస్లాం ఆధునిక భావాలను, మార్పును తీవ్రంగా గర్హిస్తుంది. కొరాన్ ఇస్లాం మతానికి 'పవిత్రమైన' మతగ్రంధం. ఆ గ్రంధం భగవంతునిచే మహమ్మదుకు పంపబడిందని ముస్లింల నమ్మిక. ఆగ్రంధం ఆధారంతో వ్రాయబడిందే షరియా చట్టం. దానిలో ఏమాత్రం మార్పును చేసినా అది నేరమని ముస్లింల విశ్వాసం. ఆనాటి చట్టాలు, సూత్రాలు, మూఢాచారాలు సార్వకాలికంగా, సార్వజనీనంగా అమలు పర్చాలి, ఆచరించాలి అనేదే ఇస్లాం ధ్యేయం. ఇస్లాం ఒక వ్యవస్థిత మతం; కరుడు గట్టిన ఛాందసాచారాలతో ఆ మతాన్ని రక్షించాలన్నదే వారి తపన, ధ్యేయం; వారిలో ప్రముఖుడు అయతుల్లా ఖొమేని. కాలచక్రాన్ని వెనక్కు మళ్ళించే ఖొమేని శాసనాలు గమనార్హం.

ఇరాన్‌లో ఇటీవల స్త్రీలపై జరుగుతున్న ఘాతుకాలు మానవత్వాన్నే వమ్ము చేస్తున్నాయి. రోజుకొక ఫర్మానా జారీ అవుతోంది. 28-8-82 నుండి "స్త్రీ పురుషులు ముద్దుపెట్టుకుంటే ముప్పయి కొరడాదెబ్బలు తినాలి". ఇటీవల స్త్రీలు మతం విధించిన దుస్తులనే ధరించాలని ఆర్డర్లు జారీ చేయబడ్డాయి. వారు వంటఇళ్ళకే పరిమితం కావాలనీ, తమ భర్తల కోసం, బిడ్డల కోసం త్యాగాలు చెయ్యాలనీ, షా పరిపాలనకు పూర్వపు స్థితిలోకి పోవాలనీ ఫర్మానా జారీ అయింది. వారు వంటఇళ్ళకే పరిమితం కావాలనీ, పిల్లల పెంపకర్లు గృహకృత్యాలకే అంకితం కావాలనీ శాసించారు. శరీరమంతా నల్లని ముసుగు ధరించినవారే ఆఫీసులకు రావాలని ఆదేశించారు. స్త్రీలకు [illegible] తగదనే నెపంతో అనేక మందిని ఉద్యోగినులను బలవంతంగా ఇళ్ళకు పంపేశారు. నల్లని ముసుగేకాక ముక్కు పైభాగాన తోలు కచ్చడాలు

ధరించాలని ఉత్తరువులొచ్చినట్లు వార్తలొచ్చాయి. ఇది అన్యాయమని అనేకమంది స్త్రీలు ప్రదర్శనలు చేశారు. వారిని ఖొమేనీ అనుచరులు ఆయుధాలచే కొట్టించారు. కత్తులతో, చాకులతో జాకెట్లు చింపించారు. అది చాలక మతనాయకులు నల్లని గుడ్డలు నోటికి కట్టుకుని "మీ జీవితాలేకాక మీ మనస్సులు, మీ హృదయాలు కూడా జిడ్డు పట్టినాయి" అనే సంకేతాలతో ఎక్కిరిస్తూ, అధిక్షేపిస్తూ ఊరేగారు.

ఇటీవల లైంగిక నేరాలు చేశారని నలుగురు స్త్రీ పురుషులను టెహరాన్‌లో రాళ్ళతో కొట్టి చంపారు. ఇరాన్‌లో విమానం దిగగానే సెక్సీ పత్రికలు లాక్కొని పంపటం సర్వసాధారణమయింది. టి. వి. లో స్త్రీకి ఏ మాత్రం ఒంపుసొంపులున్నా, ఏ కొద్ది ప్రేమసల్లాపమున్నా స్త్రీ ముఖమున్న చోట నలుపు రంగువస్తుంది. ఆమె అసలు ముఖం చూపరు. బురఖా లేని స్త్రీని టాక్సీ ఎక్కించుకోరు. డాక్టర్లు, నర్సులు, టీచర్లు తప్ప స్త్రీలను ఏ ఉద్యోగంలోకి తీసుకోరు. భార్యాభర్తలు కారులోపోతున్నా గుర్తింపు కార్డు విధిగా చూపాలి. ఈ మధ్య ఒకకొత్త దంపతులను పోలీసులు పట్టుకున్నారు. ఆమె వ్యభిచారిణికాదు, తన భార్యేనని రుజువు చెయ్యాలన్నారు. ఇంటికెళ్ళి వివాహ పత్రాన్ని తెస్తున్న భర్త కారుప్రమాదానికి గురిఅయి హాస్పటల్లో చేర్చబడ్డాడు. మర్నాడు స్పృహవచ్చిన భర్త తనభార్య ఉరి తీయ బడిందని తెల్సుకొన్నాడు. అలాగే ఒక అభాగిని అయిన యువతి స్విమ్మింగు పూల్‌లో బేదింగు డ్రెస్‌తో తనఇంటి వెనుకభాగంలో స్నానం చేస్తుండగా ప్రక్కింటి పెద్దమనిషి చూచాడట. వెంటనే వెళ్ళి ఆ పిల్ల అలా జలకమాడటం వల్ల తనకు అమితమైన కామోద్రేకం కలిగిందని పోలీసులకు ఫిర్యాదు చేశాడట. వెంటనే ఆ అమ్మాయిని అరెస్టుచేసి అరవై కొరడా దెబ్బలు కొట్టమని శిక్షవేశారు. కాని ఆ అమాయకురాలు వారికా శ్రమ లేకుండా ముప్పది దెబ్బలకే ప్రాణాలు విడిచింది. 28 సం॥ స్కూలు టీచరుకు ఒక 'ఛద్దర్' (ముసుగు) బురఖా ధరించిన స్నేహితురాలుందట. ఆ నేరానికి ఈ టీచరు ఇల్లు సోదాచేశారు. ఆ ఇంట్లో FLAUBERT, ZOLA, ROUSSEAU పుస్తకాలు దొరికినాయని ఆమెను పట్టుకెళ్ళి ఉరితీశారని వార్తవచ్చింది.

ఈ మధ్య మహాఘోరాతిఘోరమైన తంతు జరుగుతున్నట్లు వార్తలొచ్చినాయి. ముస్లిం లా ప్రకారం కన్యలను ఉరికంబం యెక్కించరాదనే సిద్ధాంతముంది. అందుకని కన్యపిల్లను రేపుచేసి ఉరితీస్తున్నారట! అది చాలక ఉరితియ్యబోయేముందు వారి శరీరంలోని రక్తమంతా తీసి

తర్వాత చంపుతున్నారట. ఈ రక్తాన్ని తమ ఆశ్రితులకు ఉపయోగిస్తారని తెలుస్తుంది. ఇక తిరుగుబాటు స్త్రీలను మానభంగం చేయించటం సర్వసాధారణమయింది. అనేకమంది గర్భిణీ స్త్రీలను నానారకాల చిత్రహింసలు పెట్టడం, చంపడం మామూలయింది. బాలుర్ని పదహారు సం॥ వాళ్ళని, బాలికలను పదినిండి మెచ్యూర్ కాగానే చంపిస్తున్నట్లు తెలిసింది. అరెస్టయిన స్త్రీలను "SPOILS OF WAR" అని బిరుదులిచ్చి అపహాస్యం చేస్తున్నారు. చిన్నపిల్లల్ని కూడా అనేక విధాల హింసిస్తున్నారు. "మీరు వెళ్ళి మీ తల్లిదండ్రులతో పోలీసులకు లొంగిపొమ్మని చెప్పండి, లేదా మీకు చావులు తప్పవు" అని బెదిరిస్తున్నారు.

సౌదీ అరేబియాలో ఒక రాజవంశపు స్త్రీ ఒక మిలిటరీ ఆఫీసర్ని పెళ్ళాడిందని, ఇది రాజవంశానికే అపచారమని; మతానికి విరుద్ధమని అర్జీలొచ్చినాయి. ఇద్దరినీ రాళ్ళతో కొట్టి చంపమని కోర్టు తీర్పుఇచ్చింది. ఆ పిల్లతాత బిడ్డను రాళ్ళతో కొట్టవద్దని, కాల్చి చంపమని ప్రాధేయపడితే ఆమెను కాల్చిచంపారు; అతన్ని రాళ్ళతో కొట్టి చంపారు.

స్త్రీలు టెలివిజన్‌లో పాటలు పాడరాదని పాకిస్తాన్‌లో ఆర్డర్లు జారీ అయినాయి. స్త్రీలు మతం విధించిన దుస్తులనే ధరించాలి అంటే శరీరంలో ఏమాత్రం ఒంపుసొంపులు కనపడని విధంగా ఒదులైన దుస్తులు ధరించి ఉద్యోగాలకు, బైటి ప్రదేశాలకు పోవాలని ఆదేశించారు. గోళ్ళకు రంగులు, బిగుతైన జీనులు, పొట్టి స్కర్టులు ధరించిన వారిని నీతిబాహ్యులని ఎక్కిరిస్తున్నారు ఖొమేని అనుచరులు. అలాంటి వారిని విమానాల్లోనుండి దింపుతున్నట్లు తెలిసింది. స్త్రీలు హాకీఆట ఆడరాదని ఆదేశాలు జారీ అయినాయి. ఇస్లాం మతానికి హాకీ ఆటకు సంబంధమేమీటో?

ఇస్లాం దేశాల్లో ముస్లిం స్త్రీలు సినిమాలు చూడరాదని నిషేధిస్తూ ఉత్తర్వులు జారీ అయినాయి. 81 ఆగష్టులో పాక్ స్త్రీలు సినిమాలకు పోరాదనే ఫత్వా అమల్లోకి వచ్చింది. సనాతన భారతీయ ముసల్మానులు ఇది చాలా విశిష్టమైనదిగా, ఆదర్శమైనదిగా భావించి మహారాష్ట్రలోని జల్గాన్‌లో ఇలాంటి ఫత్వా జారీ చేశారు. ఈ ఆర్డరు ధిక్కరించినవారికి మొదటిసారి రూ. 51, రెండోసారి 121, మూడోసారి వారిని వెలివెయ్యాలని స్థానిక ముస్లిం తాబ్లీగ్ జమాయిత్ వారు ఆర్డర్లు పంపారు. ఈ ఫత్వాను అతిక్రమించిన వారిని శిక్షించటానికి రోజుకు 11 రూ. ఇచ్చి టంఫెన్ ముస్లిం గూండా యువకులను కాపలా పెట్టారు. సలీం, రెహనాషేక్ అను పేద దంపతులు సినిమాకెళ్ళారని వాళ్ళ ఇంటిపై దాడిచేసి, వాళ్ళిద్దర్ని

చావ చితకకొట్టారు ముస్లిం గూండాలు. ఈ చిత్రహింసల్ని చూచి సహించలేని రజియా పటేల్ 21 సం॥ మహిళ అతికష్టంమీద, ఆవృత్తరువును వుల్లంఘించి 40 మందిని సినిమాకు తీసుకెళ్ళినందుకు ఆమెను భయపెడుతూ, బెదిరిస్తూ లేఖలు; వర్తమానాలు వచ్చాయట.

ఇరాన్‌లో తిరుగుబాటు దార్లను వేల సంఖ్యలో హతమారుస్తున్నాడు ఖొమేని. వారిలో స్త్రీల సంఖ్య మిక్కుటంగానే వుంది. ఎదురు తిరిగినవారి కుటుంబాలే కూలిపోతున్నాయి. ఇరాన్ దేశం నేడు కురుక్షేత్రమయింది. గత మూడేళ్ళుగా మతపరమైన విప్లవంవల్ల స్త్రీల ఉనికి నశిస్తోంది. ఉద్యోగినుల పంఖ్య తగ్గిపోయింది. విశ్వవిద్యాలయాలు, స్కూళ్ళు తెరచినా విద్యా, ఉద్యోగావకాశాలు తమకు కావాలని అడిగే ధైర్యం వారికి లేదని మహిళలు వాపోతున్నారు. తమకు ఈనాడు దేశంలో, సమాజంలో ప్రాముఖ్యతే లేదని వాపోతుంది నారీలోకం. తాము తిరుగుబాటులో పాల్గొన్నా ఫలితం శూన్యమయిందని, తమ ప్రాణ, మానాలకు రక్షణలేదని నిరాశా నిస్పృహలతో విలవిల్లాడి పోతున్నారు. ఇలా పాటలలో, ఆటలలో, వృత్తులలో, శిక్షణల్లో ఇంటా బైటా కూడా స్త్రీ పట్ల అక్రమ విచక్షణ వుంది. ఆఖరికి స్త్రీలు మసీదుల్లోకి రారాదు; ప్రార్థనల్లో పాల్గొనరాదు. ఇంటిలోపల పవిత్రం అయిదుసార్లు ఆమె విధిగా నమాజు చెయ్యాలి. భర్త నలుగురు భార్యలను పెండ్లాడవచ్చు; మరెందరినైనా ఉంచుకొనవచ్చు. ఇలావ్యక్తిత్వంలేని ముస్లిం మహిళలు ఏనాడూ సభలు పెట్టి కోర్కెలూ, హక్కులూ అడిగిన పాపానపోలేదు. పైగా తమ పుట్టుక, స్థాయి దైవదత్తమంటారు అనేకమంది ముస్లిం మహిళలు.

మతం మహాక్రూరమైనది కనుకనే మహిళను గురించిన దుర్మార్గపు దోపిడీని పవిత్రంగాను, ఘోరమైన అత్యాచారాలను ఆదర్శంగాను ప్రతిపాదించింది. ఎంతకుట్రో, మరెంత మోసమో, తెలియని స్థితే మహిళల పరిస్థితి! పదమూడువందల ఏళ్ళనాటి ఆచారాలను ఈనాడు అమలుపర్చటం అనాగరికం అనవచ్చు. ఎన్నో మూఢవిశ్వాసాలు పటాపంచ లయినాయి. ప్రపంచంలో ఎన్నో మార్పులొచ్చాయి. అటువంటప్పుడు స్త్రీని తనను తాను రక్షించుకోలేని జీవిగా భావించటం, ఆమెపై ఆంక్షలు విధించటం అజ్ఞానానికి నిదర్శనం; మత మౌఢ్యానికి మూలం అనేది నగ్నసత్యం.

సమాజంలో ఒక వర్గంలో జరుగుతున్న అసమానత్వాన్ని, అన్యాయాన్ని ఎత్తిచూపే బాధ్యత ప్రతివ్యక్తికీ వుంది. మతమనేది మానవ స్వేచ్ఛకు, విశ్వమానవ కల్యాణానికి నాంది కావాలి కాని, ఇలా విధ్వంసకాండను ప్రయోగించడం అమానుషం. ఇకనైనా మతనాయకులు స్త్రీ సంక్షేమాన్ని వాంఛిస్తూ తద్వారా సమాజ ప్రగతికి తోడ్పడగల రీతిలో ముందుగతి సాగిస్తారని ఆశిద్దాం.

# స్త్రీలు-సంస్కృతి: సంప్రదాయం

—మల్లాది సుబ్బమ్మ

వ్యక్తి నడవడి, అతనిలో అంతర్భూతమైన పాండిత్యం, మానవ విలువలు, ప్రతిభ, వర్చస్సు, కళావిజ్ఞత, వ్యవహార దక్షతలను బట్టి అతని యొక్క సంస్కృతిని నిర్వచించ గలం. అలాగే వ్యక్తుల ప్రతిభా వ్యుత్పన్నతలను, వినయ వివేకాలను, సౌశీల్యతను, సంప్రదాయాలను బట్టి ఆ సమాజ సంస్కృతిని చెప్పగలం. ఆ విలువలతోనే భారతీయ సంస్కృతిలో స్త్రీ స్థానాన్ని, హోదానుబట్టి భారత స్త్రీ పరిస్థితిని వివరించడం సమంజసమని పేర్కొనవచ్చు. అసలు స్త్రీ సంస్కృతి, పురుష సంస్కృతి అనే తేడాలు వారి ఆచార వ్యవహారాలను బట్టి నిర్దేశిస్తున్నారు. పురుష జీన్సు-స్త్రీ జీన్సులలోకాని, పురుష రక్తం-స్త్రీ రక్తాలలోగాని తేడాలు ఎలా వుండవో అలానే సంస్కృతికూడా విభిన్నం కాదనేది గుర్తించలేని అయోమయ పరిస్థితే మన భారతీయ సంస్కృతి ప్రత్యేకత. అసలు సంస్కృతి యొక్క నిర్వచనం వేరు. నాగరికతకు, సంస్కృతికి భేదం తెలియనివాళ్ళవల్ల సంస్కృతి అర్థరహితమైపోతుంది. నాగరికత అంటే మన వేషభాషలు; మనం ఉపయోగించే పనిముట్లను బట్టి చెప్పుకుంటాం. ఒకనాడు ఎద్దుల బండిలో ప్రయాణంచేసిన మనం ఈనాడు కార్లలో, విమానాల్లో తిరుగుతున్నాం. అలాగే ఆకులు, చర్మాలు ధరించిన మనం నాణ్యమైన వస్త్రధారణ చేస్తున్నాం. ఏ. సి. లు, గ్యాసు, ఎలక్ట్రానిక్ పరికరాలు వగైరా వాడుతున్నాం. విజ్ఞానాభివృద్ధివల్ల ఈనాడు మన నాగరికత ఆధునిక విధానాలతో పయనిస్తోంది. ఇది గణనీయమే. కాని సంస్కృతి అంటే మానవ విలువలు, ఉద్వేగాలు, లక్షణాలు, ఆచారవ్యవహారాలు అని చెప్పాలి. కాని, అవి మారలేదని చెప్పటం సాహసం కాదనుకుంటా. ఆ గీటురాయితో తూకంవేస్తే నేటి భారత స్త్రీ హోదా క్లబ్బుల్లో, వేషభాషల్లో, విద్యా ఉద్యోగ నిర్వహణల్లో కొంత మార్పు వచ్చింది. అంటే స్త్రీ స్థానం బానిసత్వంనుండి 'షోకేస్'లోని బొమ్మస్థితికి మారింది. అది నేటి నాగరికతా ప్రభావ చిహ్నంగా చెప్పవచ్చు. సాంస్కృతికంగా ఆలోచిస్తే పాతని పొగుడుకుంటూ, పాతకాలంలో జీవిస్తూ మనదాన్ని మించిన సంస్కృతి ప్రపంచంలోనే లేదని డంబాలు పల్కటమే మన సంస్కృతిగా మిగిలింది ఈనాడు.

అసలు మన సంస్కృతి సంప్రదాయాల గురించి చెప్పాలంటే మత శక్తుల కౌగిళ్ళలో బిగింపబడ్డదే మన సంస్కృతి. మన స్త్రీలు మత సంప్రదాయ కట్టుబాట్ల చట్రాలలో బంధింపబడ్డ కూపస్థ మండూకాలు. ఈ పరిస్థితికి కారణాలను నెమరేసు కోవాలంటే పూర్వాపరసమీక్ష అవసర మవుతుంది. ఆర్యసంస్కృతికిమూలం వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, స్మృతులు, ధర్మశాస్త్రాలు. ఇవి నాటినుండి నేటివరకు మానవ జీవిత విధానానికి జీవగఱ్ఱలయినాయి, వాటిప్రభావంతోనే స్త్రీ జీవితం మలచ బడ్డది తరతరాలుగా. కనుకవాటిని పరిశీలిద్దాం.

అసలు వేదాలు అపౌరుషేయాలని, బ్రహ్మముఖతః వెలువడ్డాయని మతవాదుల ప్రచారం. అవి చాలా పవిత్రమైనవని విశ్లేషిస్తూ వాటికి దైవత్వాన్ని ప్రతిపాదించారు ఆస్తికులు. వేదకాలం (2200–1200 బి. సి)లో స్త్రీల స్థితి మహోన్నతంగా వుండేదని దానిని పునరుద్ధరించాలనే వాదన ఇంకా ప్రబలంగానే వుంది. అసలు వేదకాలంలో స్త్రీహోదాను నిర్వచించటంలోనే తేడాలు పుష్కలంగా వున్నాయి. వైదిక విజ్ఞానాన్ని పరిశీలిస్తే రుగ్వేదంలో చెప్పిన దానికే యజుర్వేదంలో ఒకరకంగా, సామవేదంలో మరోవిధంగా, అధర్వణ వేదంలో దానికిభిన్నంగా విపరీతమైన తేడాలతో కన్పిస్తాయి. ఒక గ్రంథంలోనే పరస్పర విరుద్ధాలు గోచరిస్తాయి. అధ్యాయానికి అధ్యాయానికి, శ్లోకానికి శ్లోకానికి విభేదాలుండి మనల్ని గందరగోళంలో పడేస్తాయి. రుగ్వేదకాలంలో స్త్రీ పురుషులలో పెద్ద తేడాలు లేవని ఆల్టేకర్, కపాడియా, ఇందిరాలాంటి పరిశోధకులు రాశారు. కాని రుగ్వేదంలోనే ఎంత హెచ్చుతగ్గులున్నాయో ఆ శ్లోకాలే తెల్పుతున్నాయి. మతదృష్టిలో ఇద్దరూ సమానులేనని, యజ్ఞయాగాదుల్లో స్త్రీకి పాత్రవుందని ఒకచోట; పున్నామ నరక విముక్తికి పుత్రుడు కావాలని మరొకచోట రుగ్వేదంలోనే వున్నాయి.

"సింగ్ రక్ష జయమానం మా పుమాంసం స్త్రియంకృణ్" (అధర్వవేదం 2–3–23)

"పుట్టబోయే కొడుకును రక్షించు. అతడిని పురుషుడిగా పుట్టించు. ఆడదిగా చేయకు"

'ప్రజాపతిర్నుంమతిః సినీవాల్య చీక్లప్త్
స్త్రైయూష్మన్యత్ర దధత్పుమాంసం దధ్రుహిః (అధర్వవేదం 6–11–3)

"ఓ దేవా! నువ్వు గర్భాన్ని సృష్టించావు. ఈ గర్భనుండి కుమారుణ్ణే ప్రసాదించు. ఆడవాళ్ళు మరెక్కడైనా జన్మించవచ్చు. కాని నాకు బాలుణ్ణే ఇమ్ము." అని అన్ని వేదాల్లో దర్శనమిస్తాయి.

అంటే తల్లి గర్భంలో వుండగానే మొదలవుతుంది ఆమె పరాజయం. ఆజన్మాంతం మగబిడ్డకోసం ఆరాటపడే తల్లి ఆడపిల్లను చూచి హతాశురాలు అవుతుంది. తానేదో నేరం చేసిన దోషిగా క్షమాపణ వేడుకుంటుంది కుటుంబ సభ్యులను. ఆడపిల్ల పుడితే ఆమెకు ఏ వేడుకలు, వుత్సవాలు చేసినట్లు ఆధారాలు లేవు వేదాలలో. ఈనాటి ఆచారంకూడా అలాగే వుంది కదా! ఆడపిల్ల పుడితే 'ఆడదే' పుట్టింది ? అంటారు.

"పుత్రి విహీనయైన తల్లి అదృష్టవిహీన" అని శతపథ బ్రాహ్మణంలో చెప్పారు. అంటే కుమారునికోసం ఆమెజీవితం కుటుంబము చుట్టూ సుడిపడి వుంటుంది. అసలు పెళ్ళి సంతానము కొరకేనని; ముఖ్యంగా బాలుని కోసమేనని ధృవీకరించారు అధర్వణవేదంలో.
ఆమె స్థితిని వర్ణించటంలో

"నవై స్త్రైని సఖ్యాని సంతి సాలావృకాణాం హృదయాణ్యేతాః

(ఋగ్వేదము 10 / 95 / 15)

ఆమె తోడేలు లాంటిది. మహాక్రూరమైనది. కనుక ఆమెకు దూరముగా వుండుము. ఏ పరిస్థితిలోనూ ఆమెతో స్నేహం పనికిరాదు.

"తస్మాత్స్త్రియోని రింద్రియా ఆదామాదీరపి పాపాత్పుంశ ఉపస్తితరం వదాంతిః"

(యజుర్వేదం 6-5-8-2)

కుక్కలు, కాకులు, శూద్రులు, స్త్రీలు ఏకజాతికి చెందినవారు. కాబట్టి స్త్రీలలో సహజంగా పాపలక్షణం, వంచనావిధానం, చీకటి [illegible] వించి వుంటాయి. కనుక వారిని దూరంగానే వుంచుము. విద్యకు స్త్రీ అనర్హురాలు; ఆమెకు తెలివితేటలు శూన్యం అని ఇంద్రుడు చెప్పినట్లు

ఇంద్రశ్చదా తదబ్రవీత్ స్త్రియా అశాస్యం నః ఉతో అహం క్రతుం రఘుమ్"

(ఋగ్వేదము 8-33-77)

అనే మంత్రంలో వివరించబడి వుంది. పెళ్ళికాని కన్యల నడతను శంకించేది వేదకాలం. "కృపణంహి దుహితా" కుమార్తె కష్టాల్ని తెచ్చి పెడుతుందంటూ ఆవేదన పడ్డట్లు చాలా ఆధారాలున్నాయి.

"అరోహసూర్యే అమృతస్యలోకం స్యోనం పతిభ్యోవహతుం కృణుత్వా"

అధర్వవేదంలో స్త్రీని కేవలం స్థిరాస్తిగా నిర్దేశించారు. 'ఓ పురుషులారా! ఈ ఫలప్రదమైన స్త్రీలో విత్తనాలు నాటండి' అనే భావం ఆ మంత్రంలో వుంది. ఈ విషయాన్ని నారదుడు హరిశ్చంద్రుడితో

చర్చించినట్లు రుగ్వేదాన్ని ప్రస్తావించించిన ఆత్రేయ పురాణంలో వుంది. ఈ వేదవాఙ్మయంవల్ల మనువుకు పూర్వమే స్త్రీ పతనానికి బీజలునాట బడ్డాయనేది గోచరమవుతుంది. ఆ సిద్ధాంతాలనే ధర్మశాస్త్రల పేరుతో ధృవపరిచారు ధర్మ శాస్త్రజ్ఞులు.

మను ధర్మశాస్త్రం (200 బి. సి 500 ఎ. డి)లో స్త్రీ పుట్టినదాది మెట్టి వరకు ఆమె విధులు సూత్రీకరించబడ్డాయి. ఆమెకు ఆజన్మాంత సంరక్ష కత్వం విధించబడింది.

"భర్త దుర్వినీతిపరుడైనను, వ్యభిచారియైనను, ఏ సద్గుణములు లేనివాడైనను, భార్యవానిని భగవంతునివలె పూజింప వలయును" (మను 5-154)

"స్త్రీలు తమ భర్తలమాట ననుసరింపవలయును. ఇది వారి పరమ ధర్మము" (యాజ్ఞవల్క్య 1-18)

"స్త్రీకి వేరుగా యాగముకాని, క్రతువుకాని, ఉపవాసముగాని లేదు. భర్తృసేవవలననే ఉత్తమగతిని భార్యపడయగలదు. (మను. 5-145)

"భర్త జీవించియుండగా ఉపవాసములు, వ్రతములుచేయు వనిత భర్త జీవితమును హరించుచున్నది. ఆమె నరకమునబడును. తీర్థముల కేగిన స్త్రీ భర్త పాదములను, లేక శరీరమంతటిని కడిగి ఆ జలమును త్రాగవలయును. అంత ఆమె వుత్తమ గతినందును." (అత్రి. 136-137)

"భర్త లోకమునకు మించిన వుత్తమ లోకము భార్యకు లేదు. భర్తకు అహితము గావించిన స్త్రీ మరణించినప్పుడు భర్తృలోకమునకు బోజాలదు. కావున స్త్రీలు భర్తకెప్పుడును అసంతుష్టిని గలిగింపతగదు." (వశిష్ట 21-24)

"తండ్రి కుటుంబమును గూర్చి గర్వించి, భర్తయెడ అవిధేయతజూపు స్త్రీని జనసమూహము ఎదుట రాజు కుక్కలకు ఆహారముగా నిడవలెను" (మను 8-371)

"భర్తమాట వినని స్త్రీ చేతి ఆహారము నెవడును తిన తగదు. అట్టి స్త్రీని వ్యభిచారిణిగ తెలియ వలెను" "(అంగిరస 69)"

"భర్త దుష్టవర్తనుడైనప్పుడు, త్రాగుబోతైనప్పుడును, రోగగ్రస్తుడైనప్పుడును వానిని తిరస్కరించిన భార్యకు విలువగల వలువలను, నగలను, ఇయ్యక మూడు మాసములు బహిష్కరింపవలెను" (మను 10-8)

ఇలాంటివే మను స్మృతినిపరిశోధిస్తే కోకొల్లలుగా దొరుకుతాయి.

శాంతి, సహనము స్త్రీకిలేకపోతే మరోజన్మలో తోడేలవుతుంది. ఇద్దరూ కలిసి తినరాదు. అలంకరించుకునేటప్పుడు భర్త ఆమెను చూడరాదు. పురిటి సమయంలో భర్త చూడరాదు. ఆమెను చిన్నగుడ్డతో, దిసమొలతో చూడరాదు.

"సమిష్టి కుటుంబము నుండికాని, భర్త సంపాదనలోకాని ఆమెడబ్బు తీసుకోరాదు"

"సప్తపది స్త్రీ జీవితంలో ఒకేసారి. కనుక స్త్రీకి మళ్ళీపెళ్ళి నిషిద్ధము"

"నియోగానికి స్త్రీ అర్హురాలు. భర్తవైపు బంధువులతోనూ, లేక అదే కులము వారితో మాత్రమే 'నియోగం' జరగాలి."

"నియోగంచేసే పురుషునికి మిగతా శరీరమంతా నూనె, నెయ్యి పుయ్యాలి. వారి ఇతర శరీర భాగాలు ఏ మాత్రం తాకరాదు."

"తల్లి నీచంగా పనిచేసి అయినా కొడుకును పోషించాలి. కాని ఆ తల్లి తప్పుచేస్తే మాత్రం ఆ కుమారుడు ఆమెను శిక్షించాలి."

"స్త్రీకి పగటి నిద్ర పనికిరాదు. ఇతర పురుషులతో కలిసి ఉండరాదు."

"స్త్రీలు లోపల ఏడుస్తున్నా పైకి నవ్వాలి."

"పెండ్లికాని (అంటే ప్రధానం పెట్టని) పిల్లకు కడుపు వచ్చినా, కొడుకు పుట్టినా ఆ పురుషుడికే ఆ పిల్ల చెందుతుంది."

"నోములూ, వ్రతాలూచేసి భర్తచాలా కాలం బ్రతకాలని కోరుకోవాలి. వారినే సహధర్మచారిణులుగాను, గృహలక్ష్ములుగాను చెప్పవచ్చును."

ఆ సంప్రదాయం ప్రకారమే నేటికీ తొమ్మిది పిండివంటలుచేసి వరలక్ష్మిపూజచేస్తున్నారు, 9 రోజులు సావిత్రిగౌరీ పూజలాంటివిచేస్తున్నారు.

"కొడుకు పుట్టకపోతే పురుషుడు మళ్ళీపెళ్ళాడవచ్చు."

"శూద్రుడితో రమించిన స్త్రీని కుక్కలకు వెయ్యాలి. ఆ స్త్రీని కుక్కలచే చంపించినా రాజుకూడా ఏమీ అడ్డు తగలరాదు." (అందువల్లే

వశిష్టాది పురోహితులు రాజ్యాధికారాన్ని మించిన అధికారం చలాయించే వారు.)

"శూద్రుడు బ్రాహ్మణస్త్రీని చేరిస్తే వాడికి లింగవిచ్ఛేదం జరిపించాలి.'

"ఏ స్త్రీ అయినా భర్తను విడిస్తే ఆమెకు భరణం ఇవ్వరాదు. భర్తచే విడువబడిన స్త్రీకి మాత్రమే భరణం ఇవ్వాలి.

"పారిపోయిన స్త్రీని మళ్ళీ స్వీకరించవచ్చు!" అందుకే "ఏ దొడ్లోకి పోయినా ఈ దొడ్లోనే ఈ నింది" అనే సామెత వచ్చింది.

కౌమారివతి–: "పారిపోయినామెను గ్రహించవచ్చు."

అనులోమ:— బ్రాహ్మణుడికి శూద్రస్త్రీకి పుడితే స్వజాతి అని పిలవాలి.

ప్రతిలోమ:—శూద్రుడికి బ్రాహ్మణస్త్రీకి పుడితే వారిని పంచములు అని పిలవాలి.

"కన్య రజస్వల అయినాకాకపోయినా, 15 సం॥రాలకు మించకుండా వివాహం జరిపించాలి."

"తీర్థం పురుషుడికి మూడుసార్లు యివ్వాలి. స్త్రీకి, శూద్రుడికి ఒకసారే ఇవ్వాలి.

"స్త్రీని, శూద్రుణ్ణి చంపితే ప్రాయశ్చిత్తం లేదు."

ఇలా బ్రాహ్మణులు, క్షత్రియులు కలిసి సిద్ధాంత శూద్రులను ఘోరంగా దోపిడీ చేశారనేది నగ్నసత్యం. బ్రాహ్మణులే స్త్రీలను, ఇతర వర్గాలనుకూడా అనేక విధాల అణగత్రొక్కారు.

మనువు ఆపద్ధర్మంగా 'నియోగం' ప్రతిపాదించాడు. నియోగం తర్వాత ఆ పురుషుడు గురువుగాను, ఆ స్త్రీ అమ్మగాను బ్రతకాలని స్పష్టీకరించాడు. మనువు ప్రతిపాదించిన ఈ నియోగాన్ని ఋగ్వేదం నుండే గ్రహించాడనిపిస్తుంది. స్త్రీ పదకొండు మంది పురుషులతో సంతానం కొరకై సంబంధం పెట్టుకొనుట తప్పుకాదని (ఋగ్వేద శ్లోకం 10-85-45) రుజువు చేస్తున్నది. మనువు ఒక 'నియోగం' కొరకు తప్ప, భర్త కాని ఏ వ్యక్తికీ స్త్రీ చెందరాదని ధృవీకరించాడు. కాని ఋగ్వేదం 10-18-8 మంత్రంలో

"ఉదీర్ష్వ నార్యాభిజీలోకం గతాసుమేత ముపశేషఏహి హస్తగ్రాభస్యది ధిషో స్త వేదం మృత్యుర్జనిత్వమభి సంభభూక్"

ఓ స్త్రీ! ఈ మరణించినవాడితో గడపటం వృధా. ఇహలోక కార్య కలాపాల్లోకి వచ్చిచేరు. నీచేయి పట్టుకొని నిన్ను ప్రేమించినవాడి భార్యగా జీవించు అని వున్నది. అంటే స్త్రీ ఎవరో ఒక పురుషుడికి భార్య అనే పేరుతోవస్తువుగా చెందాలనే భావం గోచరిస్తుంది. లేదా ఆ విధవరాలికి జుట్టు, బొట్టు తీయించి విధి నిషేధాలను, అదుపును నిర్దేశించారు. అలా భర్తకు వస్తువుగా, పిల్లల్నికనే యంత్రంగా స్త్రీ మలచబడ్డది.

వేదకాలంలో 'సతి' లేదని, ఆనాడు స్త్రీకి విలువ వుండేదని, పురాణ యుగంలోనే సహగమనం ఆచారమయిందనే అభిప్రాయం పొరపాటని గ్రహించాలి.

"ఇయం నారీ పతిలోకం వృణానాని పద్యత ఉపత్వా మర్త్య ప్రేతమ్, ధర్మపురాణ మనుపాలయంతీ తస్యై ప్రజాం ద్రవిణంచేహ ధేహి" (అధర్వవేదం 18-3-1)

భర్తచితితోపాటు సహగమనం చేయటం ఉత్తమమని పై శ్లోకానికి అర్ధం. కనుక వేదాల్లో 'సతి' వున్నదనే విషయం గమనార్హం. సనాతన ధర్మాన్ననుసరించి ఈమె భర్త దరికి చేరుతున్నది. కనుక ఈ సతికి సర్వ సౌఖ్యాలను ఒనగూర్చుమని దాని తాత్పర్యము.

అధర్వవేదంలో 20-96-15, రుగ్వేదం 10-61-7లో అన్నా చెల్లెళ్ళ మధ్య సంబంధాలున్నట్లు, వారికి సంతతి కలిగినట్లు ఆధారాలున్నాయి. ఆ విషయమే ఒకే తల్లి బిడ్డలైన అన్నాదమ్ములు, అక్కచెల్లెళ్ళ మధ్య సంపర్కముండేదని **'Origin of Family'** లో ఏంగెల్సు రాశాడు.

స్మృతి కర్తలలో ముఖ్యుడైన మనువు ధర్మప్రవచనాలకు ముగ్ధులైన పురుషులు స్త్రీలను మహా దోపిడీ చేశారు. స్త్రీలను కనిపెట్టి వుండాలని, వాళ్ళకు స్వేచ్ఛనిస్తే వ్యభిచరించగలరని మనువు చెప్పాడు .బలవంతంగా స్త్రీని అదుపులో పెట్టడం దుస్సాధ్యం కనుక, వారికి బాధకలుగని రీతిలో అదుపులో వుంచాలని (నగానటాప్రవిస్తూ) బోధించాడు. అలా వారిని చైతన్య రహితుల్నిచేసి, బానిసత్వంలోకి మలిచాడు మనువు.

అసలు రుగ్వేదంలోనే స్త్రీకి బానిసత్వం పుట్టినట్లు ఆధారాలున్నాయి. ఆర్యులు యుద్ధంలో పురుషులను చంపి,స్త్రీలను బానిసలుగా తెచ్చి, వారిని

అనుభవించవచ్చు; అలాగే అధికార్లకు, రాజులకు బహుమానాలుగా పంపేవారట. కొందరమ్మాయిలను ఉమ్మడి ఆస్తిగా అనుభవించేవారట. తైత్తిరీయ బ్రాహ్మణంలోను, యజుర్వేదంలోనూ, 'అతిత్వ' 'ఉష్ట్రాకద్రి' 'అతికాద్రి'లలో వ్యభిచారుణులుకూడా వున్నట్లు ఆధారాలు వున్నాయి.

వేదకాల సంస్కృతి చాలా పవిత్రమైనదని, నాటిస్త్రీ హోదా చాలా గొప్పదనుకొనుట భ్రమ. వేదాలు చదివినా, నాటి వ్యవస్థ చూచినా స్త్రీకి ప్రత్యేక విశిష్టత ఏమీ లేదని చర్చించాం. వేదప్రవచనం చేసిన ఋషులలో స్త్రీలే లేరు. పైగా స్త్రీలు, శూద్రులు వేదం చదువరాదనే ఆంక్షకూడా వున్నది. అసలు వేదకాలం అనేది వందలసంవత్సరాలుసాగింది. ఋగ్వేదంలో స్త్రీల పరిస్థితి కొంతమెరుగైనా పుత్రికా, పుత్రులకు తేడాలున్నాయి. యజుర్వేదంలో ఇంకా దిగజారిన ఆమె పరిస్థితి సామవేదం నాటికి పరాకాష్టకుచేరి అధర్వణం నాటికి పూర్తిఅయింది. బ్రాహ్మణాల (600 బి.సి) నాటికి స్త్రీని హీనంగా చూస్తూ కన్యల్ని అమ్మడం, దానం చెయ్యడం దాకా వచ్చింది. ఉపనిషత్తులకు పూర్వమైన సంధియుగంలో స్త్రీ కేవలం భర్తకొరకే జీవించాల్సిన గతి పట్టింది. ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తుల్లో భర్త ఆజ్ఞదాటిన స్త్రీని తిట్టుట, కొట్టుట, లాంటి హింసించే దశకొచ్చింది. మంత్ర బ్రాహ్మణాలలో భర్తశ్రేయస్సు కోరుకోని స్త్రీని అపవిత్రురాలని అధిక్షేపించారు.

ఇకపురాణకాలం, లేక సూత్రయుగం (200 బి.సి నుండి 200 ఎ.డి.) స్త్రీ మతపరమైన హక్కులు, విద్యార్హత పూర్తిగా కోల్పోయి భర్తఆస్తిగా, కొడుకును కని పెట్టే యంత్రంగా తయారయింది. ఆ కాలం నాటికే మను, యాజ్ఞవల్క్య, విష్ణు, పరాశర, ఆపస్తంబ, శంఖలిఖిత, గౌతమ, హారిత, వ్యాసులు ధర్మశాస్త్రాలను లిఖించారు. ధర్మసూత్రాలు క్రోడీకరించి రాశినవే ధర్మశాస్త్రాలు. 100 ఎ. డి. నుండి 900 వరకూ ఈ క్రోడీకరణ జరుగుతూనే వుంది. వీరంతా స్త్రీని పుట్టుబానిసగా చిత్రించినవారే. ఆ ధర్మశాస్త్రాలే 'హిందూలా' పుట్టేదాకా శిరోధార్యాలయ్యాయి. ఈనాడు స్త్రీల ప్రగతికోసం కొన్ని చట్టాలుచేసినా స్త్రీలు మాత్రం ఆ పాతమూస నుండి, ఆ ద్వంద్వనీతి విధానాన్నుండి విడివడి స్వేచ్ఛావాయువుల్ని పీల్చ లేకున్నారనేది నగ్నసత్యం.

# దేవుని పుట్టు పూర్వోత్తరాలు

ఇంతగా మానవ జీవితాలను నియంత్రిస్తున్న, ఇంతగా మానవ మస్తిష్కాలను మలినం చేస్తున్న, ఇంతగామానవమనుగడపై ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తున్న ఆ ఘనుడెవరబ్బా? ఆ వ్యక్తిని ఎవరు సృష్టించారు ఎలా సృష్టించారు? ఎందుకు సృష్టించారు? అది వస్తువా? స్త్రీయా? పురుషుడా? ఎవరని నిర్ణయించాలి? ఎలా నిర్వచించాలి? అనేవి ప్రతి జిజ్ఞాసా పరుడు ఎప్పుడో అప్పుడు ఆలోచించక తప్పదు.

మరి మానవుణ్ణి నేనే సృష్టించానని ప్రగల్భాలు వలుకుతున్న ఆ దేవుణ్ణే నిన్నెవరు సృష్టించారని ప్రశ్నిస్తే 'హరిహరి! అపరాధం; మహా పాతకం. ఆ మహాపురుషుడు స్వయంభువు, అవాఙ్మానస గోచరుడు; అతీంద్రియుడు, నిర్వికారుడు, నిర్గుణుడు, ఆది మధ్యాంత రహితుడు' అంటూ మన్ని మభ్య పెడతారు. మరి నీకు ఆకారము లేదు, గుణాలు లేవు, చావు పుట్టుకలు లేవు, సాక్షీభూతుడవు అని అంటున్నారు కదా మరి సహస్రాక్షుడు సహస్రనామలిఖితుడు అంటారుమరొకసారి అదేనిమప్రశ్నిస్తే పాషండుడంటారు. అలా చెప్పేవారికే స్పష్టమైన అవగాహన లేదు. వారి దృష్టిలో వేదాల్లో దేవుడికి రూపనామ క్రియులు లేవు, ఉపనిషత్తుల్లో నిర్గుణోపాసన తప్ప సగుణోపాసనేలేదు. ఇక పురాణాల్లో ఒక దేవుడు ఏకపత్నీవ్రతుడైతే మరొకదేవుడికి పదహారు వేలమంది పత్నులున్నారు. ఒకడు అర్ధనారీశ్వరుడైతే, మరి ఒకని భార్య నెత్తిన-ఇంకొకడి భార్య వక్షస్థలంలో, వేరొకడి భార్యనాలిక మీద ఉంచాడంటారేగాని, ఏ ఒక్కడూ భార్యను సహచరిగా, సహకార్యకర్తగా గౌరవించనే లేదు.

మానవ జీవితాన్ని అత్యధికంగా ప్రభావితం చేసిన వాటిలో మతం ముఖ్యమైనది. అది వ్యక్తి జీవితాన్ని, సామాజిక జీవనాన్ని శాసించింది. విధి నిషేధాలను ఏర్పరచింది. నీతిని తన గర్భంలో ఇముడ్చుకుంది. ఆ యా పరిస్థితులను బట్టి విప్లవాత్మకంగాను, ప్రతిఘాతక శక్తిగాను వ్యవహరించింది. స్త్రీ పురుషుల సంబంధాల స్వరూపాన్ని నిర్ణయించింది. సమాజంలో మహిళల స్థానాన్ని హోదాను తేల్చి చెప్పింది. కనుకనే స్త్రీ జనాభ్యుదయవాదులు మతాన్ని అధ్యయనం చేయాల్సిన అవసరం ఏర్పడింది, దేవుడనే ఆ మృగతృష్ణ పుట్టుపూర్వోత్తరాలను.

ఆదిమ మానవుడు ప్రకృతి శక్తుల విజృంభణను చూచి అబ్బుర పడ్డాడు. వాన, పిడుగు, మెరుపు, పెనుగాలి వీటినిచూచి ఆశ్చర్యపడ్డాడు. తనకన్నా బలవంతులయిన మానవులు ఈ శక్తుల వెనుక వున్నారని తలపోశాడు. అలా వరుణుడు, ఇంద్రుడు, అగ్ని, వాయువు లాంటి దేవతలు అతని మనస్సుకు గోచరమయ్యారు. ప్రకృతి శక్తుల బాధనుండి తను తప్పుకోవాలంటే వారిని తృప్తి పరచాలనే భావం అతనికి కలిగింది. అనాటితనసంపదనువారికివుబలిగా సమర్పించాడు. ఆనాడు అతనిముఖ్యమైన సంపద తన సంతానము, తను మచ్చిక చేసిన జంతువులు. అలా నరబలి జంతుబలి పొడసూపాయి.

దేవతలను సమాశ్వాసించటానికి చేసే బలులకు ఒక క్రమం ఏర్పరచారు ఆనాటి సంఘ పెద్దలు. ప్రార్థనలతో ఆ దేవతలను ఆకట్టుకో జూచారు. తమ ఊహశక్తిని వినియోగించి రసవంతమైన ప్రార్థనాగీతాలను పాడారు. అవే ఉత్తరోత్తరా మంత్రాలుగా తయారయినాయి. మంత్రాలు వల్లించే జాతి ఏర్పడింది. తెగలో బలవంతుడు, వివేకవంతుడూ అయిన పురుషుడు మాంత్రికుడయ్యాడు. కాలం గడిచిన కొద్దీ మంత్రానికి ప్రాముఖ్యత వచ్చింది. దేవతలు మంత్రాధీనులయ్యారు. ఇంద్రుణ్ణి గూర్చి మంత్రం చదివితే అతగాడు జరజరా కదిలి రావాల్సిందే. "సహేంద్ర తక్షకాయస్వాహా" అని సర్పయాగంలో ఋత్విక్కు ఉచ్ఛరిస్తే తన సింహాసనం చుట్టూచుట్టుకొన్న తక్షకుడితో సహా ఇంద్రుడు వచ్చి అగ్నిలో పడిపోవాల్సిందే. ఇది మంత్రశాస్త్ర మహిమకు నిదర్శనమని డంబాలు పలికాడు నాటి మానవుడు.

మంత్ర తంత్రాలలో నమ్మకం మతంకన్నా ముందు పుట్టింది. మతంలోవున్న దేవుడు మంత్రశాస్త్ర దశలో ఉనికిలేనివాడు. సర్వ స్వతంత్రుడై భక్తులకు వరాలిస్తూ ఇతరులకు ఇబ్బంది పెడుతూ సంచరించే దేవుడు ఆనాడు లేడు. మంత్రశాస్త్ర పద్ధతి క్రతువులకూ, యాగాలకు ప్రాధాన్యత ఇస్తుంది. భారతదేశంలోని పూర్వమీమాంస ఈ కోవకు చెందినది. మనిషిలో రెండు రకాల మనస్థత్వాలు ఉంటాయి. ఒకటి అహంభావ ప్రేరితం; రెండవది ఆత్మార్పణ భావ సమన్వితం. నేను మొనగాణ్ణి అని భావించడం ఒక చెంపా, నేను ఎందుకూ కొరగాని వాణ్ణి అని తలపోయడం రెండో చంపా అతని నడవడిలో బహిర్గత మవుతాయి

మొదటిది మంత్రశాస్త్రానికీ (Magic) దారితీ స్తే రెండవది సర్వశ క్తి వంతుడయిన దేవుని సృజించి అతనికి దాసోహం అంటుంది. అలా రెండవ పద్ధతి ఆ స్తికతకు దారితీస్తుంది.

ఒకసారి దేవుని ఉనికిని ఊహించిన తర్వాత అతని స్వభావాన్ని లక్షణాలను వివరించడం మొదలు పెట్టాడు మానవుడు. దేవుని వర్ణించడానికి అతని భాష చాలలేదు. అతని పాండిత్యం పరిమితమైనది. మొదట్లో అతనిని సర్వలక్షణ సమన్వితుడని సర్వశ క్తిమంతుడని పొగిడాడు మానవుడు. ఈ దశలో దేవుడికి అగ్రహానుగ్రహాలను ఆపాదించాడు తర్వాత దేవుడు అనిర్వాచ్యుడు అగమ్యగోచరుడు అయినాడు. దేవుడంటే ఇలా వుంటాడని చెప్పలేని స్థితి సంభవించింది. నిరాకారుడు, నిర్గుణుడు, నిరంజనుడు అని చెప్పడం జరిగింది. అందువల్ల సగుణంలో నుండి నిర్గుణంలోకి మారాడు దేవుడు. ఇది ఆ స్తికతలో పరమోత్కృష్టమైన దశ.

సర్వలక్షణోపేతుడయిన దేవునికి మానవుడి లాగానే ప్రేమాభిమానాలు ఈర్ష్యాద్వేషాలు వున్నాయని తెలుసుకున్నాం. ఈ వివరణ వివేక వంతులయిన మానవులకు నచ్చక నిర్గుణ పరబ్రహ్మను ఊహించారు కాని ఆ భావనకూడా జిజ్ఞాసువులను తృ ప్తిపరచ లేదు. అందువల్ల కర్మ సిద్ధాంతం మళ్ళీ పుంజుకుంది. "చనిపోయిన తన పూర్వులు మరి ఉనికి కలిగి లేరు." అనే భావాన్ని మానవుడు భరించలేక పోయినాడు. నిన్నటి దాకా తనను కని పెంచిన తల్లి తండ్రులు తనకు విద్యాబుద్ధులు గడిపిన తాత ముత్తాతలు చనిపోగానే లేకుండా పోయినారని అనుకోవడం మనిషికి కష్ట మయింది. వారు మరోలోకంలో వున్నట్లు చిత్రించుకున్నాడు. వారి పోషణభారాన్ని కూడా తను స్వీకరించాడు. మాసికాలు, తద్దినాలు పెట్టి ఆహారాన్ని వారికి బట్వాడా చేద్దామనుకున్నాడు. కాని ఎంత కాలం ఆ పితరులు ఆ లోకంలో వుండగలుగుతారు? కనుక యమధర్మరాజును, చిత్రగుప్తుణ్ణి వూహించి స్వర్గ నరకాదులు సృష్టించాడు. పుణ్యం చేసినవారు స్వర్గానికి పోతారు. పాపం చేసిన వారు నరకానికి పోతారు. తన జీవితంలో మనిషి చేసే పుణ్యానికి, పాపానికి పరిమితులుంటాయి గదా! పుణ్యపాపాల ఫలాన్ని అనుభవించిన తర్వాత ఆ జీవి ఎక్కడుండాలి? ఏం చెయ్యాలి? మళ్లీ పునర్జన్మ ఎత్తుతాడనే సిద్ధాంతం బయలుదేరింది. నూతనజన్మ ఉత్కృష్టమైనది కావచ్చు లేక పాతజన్మకన్నా నికృష్టమైనది కావచ్చు.

ఆ జీవియొక్క ప్రారబ్ధాన్ని బట్టి నిర్ణయ మవుతుంది అంటే పూర్వజన్మలో మంచిపనులు చేస్తేమంచిజన్మ. చెడ్డపని చేస్తే నీచజన్మ వస్తాయి. ఇదంతా ఒక నియమం ప్రకారం సాగిపోతుంది. 'కర్మచక్రం కాలగమనంలో దొర్లి పోతుంటుంది. దీనిని ఆపగలవారు, మార్చగలవారు ఎవరూ లేరు; నిర్గుణ పరబ్రహ్మ అయిన భగవంతుడు కూడా ఈ విషయంలో శక్తిహీనుడే' అనే భావన మానవ మేధస్సులో మెరిసింది. భగవంతుడు సాక్షిమాత్రుడయినాడు. ఎందుకూ పనికిరాని సాక్షి ఉంటే ఏం ఊడితే ఏమని భగవంతుణ్ణి తోసి రాజన్నారు. అలా నాస్తికత్వం మళ్లీ పుంజుకుంది. ఇది స్థూలంగా మానవ భావ వికాస పరిణామ చరిత్ర. ఆయా దేశకాల పరిస్థితులనుబట్టి ఆ యా సామాజిక జీవన విధానాన్ననుసరించి దేవుని స్వభావ లక్షణాలు నిర్ణయింప బడ్డాయి. ఒక దేశంలో మంత్రశాస్త్రానికి అత్యధిక ప్రాముఖ్యత ఎర్పడితే, మరోదేశంలో ఆగ్రహానుగ్రహ సమరుడై దేవునకి నీరాజనం పట్టడం జరిగింది. మరోచోట నిర్గుణ పరబ్రహ్మను భావించడం పరిపాటి అయింది. ఇలా నిర్దిష్టంగా, తేడాలు కలిగి మనకు చరిత్రలో కన్పించవు ఈ దశలు. ఒక్కొక్కప్పుడు ఇవన్నీ అనేక పాళ్ళల్లో కలిసి మానవ జీవితాన్ని నియంత్రణ చేస్తాయి. దేనిపాలు ఎక్కువో, తక్కువో అనే దాన్నిబట్టి స్థూలంగా ఆ సమాజంలోని ఆస్తిక భావానికి, మతానికి విలువ కడతాం. ఉదాహరణకు హిందూ మతంగా చలామణి అవుతున్న బ్రాహ్మణ మతంలో మంత్రశాస్త్రం, భక్తి, జ్ఞానం ఒకే కాలంలో, ఒకే దశలో చోటు చేసుకున్నాయి. ఇదంతా మానవ సంస్కృతి వారసత్వం పుణ్యపాపాలను స్వర్గనరకాలను ఊహించిన మానవుడు పుణ్యం చేయాలని తాపత్రయ పడతాడు. అలా తన నడవడిని నియంత్రణ చేసుకొంటాడు. ఆకృషిఫలితమే నీతి. అప్పుడు సమాజపరంగా కొన్ని ధర్మాలు అవసరమవుతాయి. అవి సామాజిక నీతిగా రూపొందుతాయి. దీనిని నిర్దేశించే ఋషులు, అమలుపర్చే రాజులు, తయారవుతారు. ఒక్కొక్కదశలో ఇరుతెగలు చేసే పనిని ఒకరే చెయ్యటం జరుగుతుంది. అంటే రాజఋషులు రంగంలోకి వస్తారన్నమాట. ఈ రెండు తెగలవారు సమాజాన్ని రక్షించటానికి కంకణం కట్టుకున్నా మంటారు. కాని వారు పెత్తందార్లుగా మారిపోతారు. ఇలా ఋషిపుంగవులూ రాజులు అన్ని రకాల దౌర్జన్యాలను వాడి సమాజాన్ని తమ చెప్పుచేతల్లో వుంచుకున్నారు. వర్ణ వ్యవసను ఏర్పరచి నిచ్చెనమెట్ల సమాజాన్ని

తయారుచేశారు. తమ సమాజం చుట్టూ ఎల్లలు గీశారు. తదితరులను ద్వేషించారు. వారిని 'అన్యులుగా, కాఫిర్లుగా, పాషండులుగా' పరిగణించారు. తమ సంఘానికి ఒక దేవుణ్ణి సృష్టించుకున్నారు. పరాయి సంఘాల దేవుళ్ళను తిట్టిపోశారు. తమదేవుని ఉత్కృష్టను నెలకొల్పటానికి యుద్ధాలు చేశారు. అన్యులను తెగనరికారు; బానిసలుగా తెచ్చారు. స్త్రీలను చెరపట్టారు. ఇలాంటి సమాజం ఇంచుమించుగా అన్ని దేశాల్లోను ఎప్పుడో ఒకప్పుడు ఉన్నట్లు చరిత్రలో దాఖలాలున్నాయి.

సామాజిక నీతిని నిర్దేశించే మతం స్త్రీ పురుషుల సంబంధాన్ని; స్త్రీ హోదాను; సమాజంలో ఆమె పాత్రను విస్మరించలేదు ఎంతో వివరంగా నిర్ణయించింది. అలాగే పురుషునికికూడా విధి నిషేధాలను నియమించి, అశక్తుణ్ణి చేసి మతానికి దాసోహం చేసింది.

ప్రాచీన మానవ మస్తిష్క ఊహాజనిత ఫలితమే దైవ ఆవిర్భావం అలా మనిషిచేత సృష్టింపబడ్డ మతం మనిషినే కొరముట్టును చేసింది. వ్యక్తి చేత ఊహింపబడ్డ దేవుడు వ్యక్తినే కీలుబొమ్మను చేశాడు. ఇలా ప్రపంచంలో అనేక సమాజాల్లో మతం దేవుని పేరుతో విలయతాండవం చేస్తున్నది. మానవ విలువల్ని వమ్ము చేస్తున్నది. కనుక మత ప్రబోధితమైన సామాజిక నీతి ఈనాటికి ఉపకరించదని తెలియచెప్పటానికి మత సమీక్ష అవసరమయింది. *

# నీతికి ప్రాతిపదిక ఏది?

"మానవాతీతమైన ప్రమాణం లేకపోతే ఏది మంచో ఏది చెడో తెలియదు. ద్వేషంకన్నా ప్రేమ మంచిదని, క్రూరత్వంకన్నా కరుణ మంచిదని మనందరం అంగీకరిస్తున్నాం. ఈ భావనకు దైవేచ్ఛే ఆధారమని నమ్మాలి" అని 1952లో సి. ఎస్. లూయిస్ తన గ్రంథంలో వివరించాడు. దైవ సంకల్పానికి అనుగుణంగా నడుచుకోవటమే నీతి అని నిర్వచిస్తున్నారు సనాతన క్రైస్తవులు. పతనమైన మానవుడు ప్రకృతి సిద్ధంగా స్వార్థపరుడని, దైవ కృపవల్లనే పరార్థ జీవిగా బ్రతక గలడనీ, శిక్షలూ, బహుమతులవల్ల అతడు ప్రభావితుడౌతాడని క్రైస్తవ మతవాదులు ప్రకటిస్తున్నారు. "మేము ఘోరమైన పాపులం. మాకు స్వాస్థ్యం లేదు. నశ్వరమైన మానవ ప్రకృతిలోని బలహీనతవల్ల నీ కృప లేకుండా మేమేమీ చెయ్యలేం" అని బ్రిటిష్ ప్రార్థనా పుస్తకంలో వుంది.

"మత ప్రాతిపదిక లేకుండా పరోపకార భావన సిద్ధాంతరీత్యా సాధ్యం కాదు." అని ఆచార్య బేసిల్ విల్లీ వాదించాడు. "పొరుగువానికి సాయపడడమనే విధి అందరికీ తెలిసిన విషయమని అనుకొనుట భ్రమ. దైవం యెడల విధి నిర్వహణ చేస్తేనే పొరుగువాని యెడల అతనికి బాధ్యత ఉదయిస్తుంది" అని క్రిష్టోఫర్ హాలీస్ చెప్పాడు. "స్త్రీ పురుషులు మర్యాదగా, సభ్యతగా జీవించడానికి కారణం క్రైస్తవ మతమే" నని ఒక మత గురువు ఉద్ఘాటిస్తే "మనం సహజంగా కరుణాయుతంగా ప్రవర్తించడానికి మతమే కారణం" అని ఎడిన్‌బరో మతగురువు ఆండ్రూ మోరోటిన్ ప్రకటించాడు. ఈ భావాలన్నీ బైబిలు బోధకు అనుగుణమైనవే నని గ్రహించాలి.

తమను క్రైస్తవులుగా అభివర్ణించుకుంటున్న పాశ్చాత్యులలో సైతం కొందరికి బైబిలుకథల్లోనూ, క్రీస్తు అవతారంలోనూ నమ్మకం లేదు. అయినా సర్వశక్తి వంతుడైన, ప్రకృతి కతీతమైన శక్తిలో విశ్వాసం లేకపోతే నీతి మనజాలదని విశ్వసిస్తున్నారు.

మత విశ్వాసం లేనందువల్లే రెండవ ప్రపంచ యుద్ధంలో క్రౌర్యం, దుర్మార్గం విలయతాండవం చేసిందని మతస్థులు ప్రచారం చేశారు.

"తన శత్రువులను హింసించిన దేవునిలో విశ్వాసం కలిగిన మధ్య యుగపు క్రైస్తవులు హిట్లరు నాజీ మూకలకన్నా దుర్మార్గంగా ప్రవర్తించ లేదా?" అని ప్రశ్నిస్తే సమాధానం దొరకదు.

ఉదార క్రైస్తవులు కొంతమంది కొంతవరకు మానవవాద దృక్పథాన్ని అంగీకరించారు; మంచి చెడులు మానవ సంక్షేమ దృష్ట్యానే వివరించాలని వారు అంగీకరిస్తున్నారు. అయితే దేవునిలో విశ్వాసం లేకపోతే మానవ సంక్షేమాన్ని కాంక్షించటం అర్థరహితమని వారిభావం. సాధారణంగా నాస్తికులు స్వార్థపరులుగా వుంటారట. నిస్వార్థంగా పనిచేసే నాస్తికులలో "స్వార్థాన్ని తగ్గించి పరార్థ బుద్ధిని పెంచేది ఏదో" వుంటుందని రోనాల్డు నాక్సు అనే మతగురువు రాశాడు. ప్రతి క్రైస్తవునిలో దైవాంశ ఉంటుందని, దానివల్లనే పరోపకార బుద్ధి ఏర్పడుతుందని వారిభావన. అలాంటి చైతన్య శక్తి లాంటిది నిస్వార్థులైన నాస్తికులలో సకృత్తుగా ఉండవచ్చు. ఈ అంతర్ ప్రవృత్తిని హేతువాదులు అంగీకరించినా దానిని భగవంతునితో సమానంగా చూడరు. పరార్థబుద్ధిని పెంచటానికి దేవుని అవసరం లేదని హేతువాది నమ్మకం; అలాగే మనిషిలోని క్రూరత్వానికి దయ్యంయొక్క ఉనికితో పనిలేదు. మానవునిలోస్వార్థం, పరోపకార భావన రెండూ ఉంటాయనే దానికి నిదర్శనాలు అనేకం వున్నాయి. జంతువుల్లో లాగానే మానవుడిలోనూ సహజాతంగా సహకారం, పరార్థం, దౌర్జన్యంకూడావుంటాయి. మానవుడు సహకార సామాజిక జంతువు.

జంతు వారసత్వం నుండి మానవ సంస్కృతి పెరిగినా నిస్వార్థత, సహకారం లాంటి కొన్ని లక్షణాలు సహజాతంగా వుంటాయనే దానికి నిదర్శనాలనేకం వున్నాయి. కోతులూ, తోడేళ్ళూ గుంపులుగా సాముదాయికంగా జీవించేవి. కాగా గుంటనక్కలు కుటుంబానికి మాత్రమే పరిమితమైనవి. ఈ రెండు జాతుల్లోనూ సహకారభావం వున్నా కుటుంబానికే పరిమితమైన జాతుల్లో వాటి సంతానానికి, జత జంతువుకు మాత్రమే పరిమితమవుతుంది. కాని గుంపులుగా వుండే జంతువుల్లో ఆ సహకారభావం, పరార్థ జీవితం గుంపులో అందరికోసం జరుగుతుంది. ఈథలాజీ (వన్యమృగాలను అరణ్యాలలో పరిశీలించే శాస్త్రం) ప్రకారం బాబూన్ అనే కోతుల గుంపులో ఒక వ్యూహరచన కనబడుతుంది. తల్లుల్ని,

పిల్లల్ని మధ్యవుంచి శతృవుల నుండి వాటిని మగకోతులు రక్షిస్తాయి. స్నేహార్ధభావాలు జంతువుల్లో బాగా వుంటాయి. సభ్యులమధ్య కోతిమూకల్లో తగాదావస్తే నాయకత్వం వహించే కోతి దౌర్జన్యాన్ని ఆపుతుంది. కోతులు ప్రాణాలు త్యాగంచేసి అయినా గుంపును రక్షించడం జరుగుతుందని శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేశారు.

మానవుడు సామాజిక జీవి అన్నప్పుడు సామాజిక జంతువులలో వున్న సేవాదృక్పథం, పరార్ధభావన మానవుడిలో సైతం సహజాతంగా వస్తుందని అంగీకరించక తప్పదు.

ఆదిమ మానవజాతి పూర్వీకులైన వానరజాతి, అర్ధమానవ జాతులలో వున్నట్లుగానే గుంపులుగా జీవించారని తేలింది. చైతన్య చోదిత సహకార భావంవల్లే నూతన జాతిగా మానవజాతి పరిణామ ప్రక్రియలో ఉదయించిందని 1961లో క్లార్క్ స్పష్టీకరించాడు.

ఆదిమ మానవుడు బ్రతకటానికి గుంపులోపల సహకారం, గుంపు వెలుపలఆనాడు అవసరమైనాయి సహకార దౌర్జన్య ద్వైరన్యం భావాలు సహజాతాలు అన్నంత మాత్రాన తర్వాత అవి మారడానికి వీలులేనివనడం అర్ధరహితం. దౌర్జన్య కరమైన నడత మానవునికి స్వతసిద్ధమని, సామాజిక శిక్షణవల్ల మత విశ్వాసాలవల్ల అతనిలో సహకార భావం ఉదయిస్తుందని వాదించే మతస్తుల భావం పూర్తిగా పొరపాటని గ్రహించాలి. మనిషి బ్రతకటానికి సహకార భావం అవసరమని మున్ముందుగా గుర్తించినవాడు డార్విన్. ప్రకృతి వరణంవల్ల పరిణామం జరుగుతుందని డార్విన్ నిరూపిస్తే మనుగడకోసం వ్యక్తుల మధ్య పోరాటం వచ్చిందని మతవాదులు భాష్యం చెప్పారు.

''ఒక సమాజం బ్రతకాలంటే పరస్పర సహాయం, సహకారం అవసరం. అవి ఎంతవరకుంటయో ఆ మేరకే ఆ సమాజం బ్రతక గల్గుతుంది'' అన్నాడు డార్విన్. 'మానవ అవతరణ' అనే తన గ్రంథం నాల్గవ అధ్యాయంలో సాముదాయక జీవితం సాగించే జంతువులలోని సహకార ప్రవర్తనకు అనేక ఉదాహరణలు ఇచ్చాడు. అంతేకాక, ''క్రింది తరగతి

జంతువులలో సామాజిక భావనలు సహజాతంగానూ, అంతర్గతంగానూ వుంటున్నాయనే విషయం వివాదాస్పదం కాదు; మానవునిలో మాత్రం అలా ఎందుకుండకూడదు" అని వ్యాఖ్యానించాడు. ఆ అధ్యాయాన్ని ముగిస్తూ నీతిని గురించి డార్విన్ చేసిన భావ ప్రకటన హేతు వాద దృక్పదాన్ని వెలిబుచ్చుతుంది. "మానవుని నైతిక నిర్మాణం యొక్క ప్రాథమిక అంశాలయిన సామాజిక సహజాతాలు మేధాశక్తుల సహాయం తోనూ, అలవాటు ఫలితంగానూ అనుసరించదగిన మధ్యేమార్గానికి దారి తీస్తాయి. "ఇతరులు నీ యెడల ఎలా ప్రవర్తించాలని కోరుకుంటావో అలాగే నీవు ఇతరుల యెడ ప్రవర్తించాలి అనే సూత్రం నీతికి పునాది. ఒరులేయవి ఒనరించిన" అనే భారతంలోని సూక్తి దీనికి తార్కాణం.

క్రీ. పూ. 6 నుండి 3 వ శతాబ్దం వరకు చైనాలోను, ప్రాచీన గ్రీసు, రోములలోను మానవుడు సామాజిక జీవి అనే విషయాన్ని అంగీకరించడం జరిగింది.

"మనం ఒక సమాజంలో సభ్యులం. ప్రకృతి మనల్ని బంధువుల్ని చేసింది. మనలో పరస్పర ప్రేమనునాటి మనల్ని సామాజిక జీవితానికి తయారు చేసింది." అని తత్వవేత్త సెనికా వక్కాణించాడు. ప్రముఖ వక్త సిసిరో "మానవులు ఒకరికొకరు సహాయం చేసుకొనే నిమిత్తమే మానవుల కోసం పుట్టారు. మనంమనుషులను ప్రేమించటానికి ప్రకృతి అనుగుణమైన స్వభావాన్ని ఇచ్చింది ఇదే న్యాయశాస్త్ర పునాది." అని వ్రాశాడు. కనుక క్రైస్తవ మత ఆవిర్భావానికి ఎన్నో వందల సంవత్సరాల పూర్వమే అనేకమంది తత్వవేత్తలు పరస్పర ప్రేమ, స్నేహహార్దాలను గురించి నొక్కి వక్కాణించారు క్రైస్తవ మతంవల్ల సభ్యత, సంస్కారం మానవ సమాజంలో ఏర్పడ్డాయని భావించడం సబబు కాదు; చరిత్ర ఆ అభిప్రాయాన్ని సమర్ధించడం లేదు.

మానవుడు సామాజిక జీవి అనే విషయాన్ని అంగీకరించనందువల్ల పూర్తిగా స్వార్ధపరమైన నీతి వ్యవస్థను క్రైస్తవ మతం ప్రకటించి ఆచరించింది. మానవుని సామాజిక లక్షణాలను నిరుత్సాహపరచి తాము పవిత్రంగా జీవించడం, ముక్తిని సాధించడం అనే స్వార్ధపర లక్ష్యాలను ప్రబోధించింది.

దేవునిలో నమ్మకంలేని వ్యక్తి 'దేవుని ఇష్టాయిష్టాలను నేనెందుకు అనుసరించాలి' అని ప్రశ్నిస్తే దేవుడు మంచినే ఎన్నుకుంటాడు అని వాదిస్తాడు విశ్వాసి.

ఈ వాదన తర్కానికి నిలవదు. అవి మంచివి కనుక దేవుడు వాటిని ఎన్నుకుంటాడంటే, ఆ విశ్వాసికి దేవునితో సంబంధం లేకుండానే మంచి ఏదో తెలుసునని చెప్పవచ్చు. ఇక దేవుడు ఎంపిక చేశాడు కనుక అది మంచిదవుతుందా అంటే దేవునిచేత పేర్కొనబడటమే మంచి తనంగా చెప్పవచ్చు. అప్పుడు దేవునిచేత ఎంపిక చేయబడిందే దేవుడు ఎన్నుకుంటాడని చెప్పినట్లు అవుతుంది. అంటే చెప్పిందేచెప్పటం అవుతుంది. ఇది. అర్ధరహితం. ప్రొఫెసర్ ఎ. జె. అయ్యర్ ఇలా విశదీకరించాడు.

"దేవుడు ఎన్నుకున్నదే మంచిది అని అంగీకరిస్తే దేవుడు చెడు ఎంపిక చేసినా అది మంచిగానే కనపడాలి. దేవుడు మంచినే చేస్తే అది మంచిది అని మనకు ముందుగానే తెలుసు కనుక దేవునితో నిమిత్తం లేదు. ప్రకృతికి అతీతమైన శక్తితో నమ్మకం నీతికి ఆధారం కానక్కర లేదని నిర్ణయించగలం.

సామాజిక సహజాతాల పైననే నీతి ఆధారపడుతుందని అంటే దౌర్జన్యమూ, క్రూరత్వమూ మన మానసిక సంపత్తిలో ఎలాభాగాలో అలాగే పరోపకారబుద్ధి సహకారమూ కూడా మనలో అంతర్భాగాలనీ, నిస్వార్ధత, పరస్పర ప్రేమ సమాజ మనుగడకు అవసరమని, వాటిని పెంచాలని భావం.

క్రీస్తు శీలం దోషరహితం కాదనీ, అతడు బోధించిన నీతి మానవాళికి మంచికన్నా చెడు చేసిందనీ ఆధారాలు చూపగలం.

బిడ్డలకు క్రైస్తవ బోధచేసి నైతిక ప్రమాణాలను నిలబెట్టుకోవాలనుకోవడం ఆత్మవంచన అని, వృధా ప్రయాస అని రుజువు చేయగలం. కనుక క్రైస్తవ మత నీతిని హేతువాదులు వ్యక్తిత్వం లేని నీతిగా, ఆత్మవంచనకు దారితీసే ప్రబోధంగా పరిగణిస్తున్నట్లు **'Honest to man'** అనే గ్రంథంలో మార్గరేట్ నైట్ విపులీకరించింది.

# ఏసు క్రీస్తు బోధలు

## ప్రేమ : ప్రతిఫలం

ఈ నాడు క్రైస్తవులు ఒక విచిత్రమైన వైఖరిని ప్రదర్శిస్తున్నారు మన భాషలో, మన పదజాలంలో "ప్రేమ" అనే పదాన్ని క్రైస్తవం ప్రవేశ పెట్టిందని, ప్రేమ, క్షమాభిక్షలను గురించిన ఏసుబోధలు కొత్త యుగానికి నాంది పల్కాయని ప్రచారం చేస్తున్నారు. ఇది నిజం కాదు. క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దంలో చైనాలో మానవవాద తత్వవేత్తలు, తర్వాత యూదులు, ఆ తర్వాత రోమనులు, గ్రీకులు ఈ భావాలనే ప్రకటించారు.

'నీకు ఏది అయిష్టమో దానిని ఇతరుల యెడల చేయవద్దు'. అని చైనా తత్వవేత్త కన్‌ఫ్యూషియస్ చెప్పాడు. అంతకు ఒక శతాబ్దం క్రింద ఎవరైనా కష్టనష్టాలు కలుగ జేస్తే వాటికి బదులుగా మంచి పనులు చేయమని చైనా తత్వవేత్త లావో బోధించాడు. క్రీ. పూ. 400 సం॥లో పొరుగువాణ్ణి తనలాగానే ప్రేమించమని యూదుల మత గ్రంధం ఆదేశించింది. పాపిని క్షమించమని అతనిపై ద్వేషం పెంచుకోవద్దని యూదుల గ్రంథం ఒకటి క్రీ. పూ. 2వ శతాబ్దంలోనే చెప్పింది. కోపాన్ని అణుచుకోమని తప్పుదారిని పొయ్యేవారిని రుజుమార్గాన పెట్టమని సెనెకా, రోమన్ తత్వవేత్త ప్రకటించాడు. అంతేకాక దెబ్బకి ఎదురు దెబ్బ తీయవద్దని నొక్కిచెప్పాడు. వీటినిబట్టి క్రీస్తుయొక్క బోధలలో ప్రత్యేకత ఏమీ లేదని తెలుస్తుంది. కాకపోతే ఒకతేడా మాత్రం వుంది. క్రీస్తు పూర్వీకులు మానవ సంబధాలను గురించి ప్రస్తావిస్తే, ఏసు బోధలలో మానవునికి, దేవునికి మధ్య వున్న సంబంధానికి ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది. మానవ సంక్షేమానికి పాటుపడడంకూడా భగవంతుని వుద్దేశ్య ప్రకారం విధేయతగా నడుచుకోడానికే.

ఇతరులను ప్రేమిస్తే వచ్చే ప్రతిఫలాన్ని గురించి లూకా ఆరవ అధ్యాయంలో 35, 38 వాక్యాలలోనూ, మత్తయి ఆరవ అధ్యాయం

నాలుగవ వాక్యంలోనూ, మత్తయి 16వ అధ్యాయం 27 వాక్యంలోను' ప్రస్తావించబడింది. అంటే సత్కార్యానికి ప్రతిఫలం పరలోకంలో వుంటుందన్నమాట. ప్రేమ ప్రతిఫలాలను గురించి ఏసు బోధకంటె మంచికి ప్రతిఫలం మరేమీ లేదు. అని చెప్పిన స్టోయిక్ ప్రబోధమే మెరుగయింది.

## వ్యక్తిగత సంబంధాలు:

వ్యక్తిగత సంబంధాలను గురించి సువార్తలు మహోన్నత బోధలు చేశాయని ఉదారవాద క్రైస్తవులు ప్రచారం చేస్తున్నారు. సువార్తలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ అభిప్రాయం తప్పని తేలుతుంది. దేవునికీ, మానవునికీ మధ్య వున్న సంబంధంకన్నా మానవునికీ, మానవునికీ మధ్య వున్న సంబంధం తక్కువ స్థాయిదని క్రైస్తవం చెపుతుంది. అంతేకాక మానవుల మధ్య సంబంధాలు, మనిషికీ దేవునికి మధ్య సరియైన సంబంధం ఏర్పడటానికి అడ్డు పడతాయని భావిస్తుంది ఆ మతం. ఇతరులకు దానం చెయ్యడం విధిగా చెయ్యాలని కోరుతుంది. అంతేకాక ప్రేమతో దానం చెయ్యరాదట. సన్నిహితులపట్ల ప్రేమాస్పదులపట్ల, అతిగా అభిమానం పెంచుకోవడం తప్పని చెపుతుంది. "నా పేరుకోసం సంపదను, సోదరీ సోదరులను, తల్లిదండ్రులను భార్యా పిల్లలను, వదులుకున్నవాడు వంద రెట్లు ప్రతిఫలాన్ని పొందుతాడు. శాశ్వత జీవితానికి వారసుడు అవుతాడు". (మత్తయి సువార్త 19 అధ్యాయం 29వ వాక్యం) "మనిషికి తండ్రితో విభేదము కల్పించడానికి, కూతురుకు తల్లికి శత్రుత్వం కలుగ జేయడానికి నేను అవతరించాను............అతని కుటుంబీకులే అతనికి శత్రువులు." (మత్తయి సువార్త 10 అధ్యాయం వాక్యాలు 35, 36.)

"ఎవడైనా, నావద్దకు వచ్చికూడా, తల్లి తండ్రులను, భార్యా పిల్లలను సోదరీ సోదరులను, ఆ మాట కొస్తే తన జీవితాన్ని కూడా ద్వేషించకపోతే అతడు నాశిష్యుడు కానేరడు." (లూకా అ. 14, వా, 26)

కుటుంబీకులతో సత్సంబంధాలు పెంచుకోరాదని ఇలా ఆదేశించడం జరిగింది. ఈ సూత్రాలను పాటించి అంధకార యుగంలో రెండు శతాబ్దాల

పాటు క్రైస్తవ సన్యాసులు జీవితాలను కలుషితం చేశారు. నిజానికి ఈ సూత్రాలను పాటిస్తే ప్రపంచం నరకంగా తయారయ్యేది. కనుపించని దేవుని ప్రేమించేకన్నా కట్టెదుట నిలచి వుండే బంధువులను అభిమానించడం తేలికపని; అంతేకాక, సహజమైనదికూడా, మానవుడు సామాజిక జీవి కనుక తోటిజీవుల సంక్షేమానికి అతడు కృషి చేస్తాడు. అలా చేయడానికి దేవుని ఆజ్ఞగా చెప్పే ఏసుబోధ అవసరం లేదు.

## మానవ సౌభ్రాతృత్వం

విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఏసు మొదటిసారిగా ప్రబోధించాడని చెప్పడం సబబు కాదు. క్రీ. పూ. మొదటి శతాబ్ధంలోనే "తోటి పౌరుల హక్కులను గౌరవించాలనడం విదేశీయుల హక్కులను తృణీకరించాలనడం విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని నాశనం చేస్తాయి." అని సిసిరో రాశాడు. తనబోధనలను ప్రపంచం మొత్తంమీద అన్ని జాతులకు వ్యాప్తిచెయ్యాలని ఏసు ప్రకటించాడని చెప్తారు.

అలాంటి భావాన్ని స్ఫురింపజేసే వాక్యం మార్కు సువార్త అ. 16, వా. 9-20లలో వుంది. దానిని ప్రక్షిప్తంగా ఎంచుతున్నారు. మరికొన్ని చోట్ల అంటె మత్తయి అ. 28 వా. 19, మార్కు అ. 16 వా. 15, లూకా అ. 24, వా. 47 కార్యాలు అ. 1 వా. 8 లోని వాక్యాలు ఏసుక్రీస్తు మరణానంతరం ఆయన మరల లేచి చెప్పినట్లు రాశారు. వీటికి చారిత్రిక ఆధారాలు లేవు. తన బోధనలను, యూదులకు మట్టుకే ఏసు పరిమితం చేసినట్లు మత్తయి అ. 10 వా. 5-6, మత్తయి అ. 15, వా. 24-26 రుజువు చేస్తున్నాయి. సుమేరియా దేశవాసులకు వుద్దేశించి చెప్పిన బోధ ఏసు యొక్క విశ్వమానవ దృక్పథానికి నిదర్శనం కాదు. ఆ దేశవాసులు తక్కువ జాతి యూదుల క్రింద లెక్క.

వాస్తవానికి ఏసుక్రీస్తు యూదుల రక్షకుడుగానే భావించుకున్నాడు. కాబట్టి విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఏసు బోధించాడని ప్రచారంచేయడం పెద్దపొరపాటు.

## పరలోక దృష్టి:

ఏసు జన్మించేనాటికి యూదుజాతి అప్పటికి 60 సం॥రాల నుండి రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వంలో వుంది. ఏప్పుడో ఒక రక్షకుడు వస్తాడని, అతడు దాస్య విముక్తి చేస్తాడని యూదులు నమ్మారు. ఆ రక్షకుడు మానుష్యకుమారుని రూపంలో వస్తాడని ఆశించారు. నిజానికి తానే ఆ రక్షకుడనని, మనుష్యకుమారుడనని ఏసు విశ్వసించాడు.

ప్రపంచం నశిస్తుందని దేవుని రాజ్యం అవతరిస్తుందని ఏసు ప్రకటించాడు. తను మరల వచ్చేనాటికి తన శిష్యుల్లో చాలామంది జీవించి వుంటారని ప్రకటించాడు. "ఇక్కడ నిలిచివున్న వారిలో కొందరు మనుష్య కుమారుడు తన రాజ్యముతో వచ్చుట చూచువరకు మరణము రుచి చూడరని నిశ్చయముగా మీతో చెప్పుచూన్నాను." (మత్తయి అ. 17, వాక్యం 28)

శిష్యులను ప్రచారం నిమిత్తం పంపి వారు తమ విద్యుక్త కార్యాన్ని నిర్వహించేలోగానే లోకం నశిస్తుందని క్రీస్తు చెప్పాడు. "మనుష్య కుమారుడు వచ్చువరకు మీరు ఇశ్రాఏలు పట్టణములలో సంచారముచేసి యుండరని నిశ్చయముగా చెప్పుచున్నాను. (మత్తయి అ. 10, వా. 23) ............తన పునరుద్దానము వరకు జీవించి వుండవలెనని శిష్యులను హెచ్చరించెను. "జాగ్రత్తపడుడి; మెలకువగా నుండి ప్రార్ధన చేయుడి ఆ కాల మెప్పుడు వచ్చునో మీకు తెలియదు." మార్కు, 13; 33.

"మీరు అనుకొనిగడియలో మనుష్య కుమారుడువచ్చును, కను క మీరును సిద్ధముగ వుండుడు అని చెప్పెను." లూకా, 12; 40.

ఏసుక్రీస్తు ఈ ప్రపంచంలోని జీవితాన్ని మెరుగుపర్చటానికి శ్రద్ద చూపలేదు; ఎంత సేపటికీ రాబొయ్యే ప్రపంచంలోని శాశ్వత సంక్షేమాన్ని గురించి ఆసక్తి కనపరిచాడు ఆదే క్రైస్తవ మతంలో చోటుచేసుకుంది. క్రైస్తవ మత గురువు టెర్ట్యూలియన్ "ప్రజా వ్యవహారాలకన్నా మాకు తక్కువ ఆసక్తి కల విషయం లేదు" అని చెప్పాడు. శతాబ్దాలు గడచినా తుది తీర్పురోజు దగ్గర్లో లేకపోయినా క్రైస్తవులు అదే వైఖరిని ప్రదర్శిస్తూ వచ్చారు.

ఏసు పరలోక ప్రపంచాన్ని గురించి శ్రద్ధచూపటానికి రాజకీయ కారణాలున్నాయి. యూదులు పరాధీన జాతి. వారు పరాధీన జీవితానికి అనుగుణమైన సద్గుణాలను మాత్రమే అలవర్చుకోగలరు. అందుకే ఏసు విధేయత, అణుకువ, దీర్ఘకాలం బాధలను సహించుట, ఓర్మి మొదలైన సద్గుణాలపై నొక్కు పెట్టాడు. అందువల్లనే క్రైస్తవ మతం పురుషులకన్నా స్త్రీలను హెచ్చుగా ఆకర్షించింది.

ఏసుక్రీస్తు అణచివేతకు గురిఅయినవారిని సమర్థించినా సమానత్వానికి కృషిచేయలేదు. కాగా వారిస్థానాలకు తాను మార్పు సంకల్పించాడు "సింహాసనముల నుండి బలవంతులను పడద్రోసి దీనుల నెక్కించెను ఆకలిగొనిన వారిని మంచి పదార్థములతో సంతృప్తిపరిచి, ధనవంతులను ఒట్టి చేతులతో పంపివేసేను." లూకా 52-53. దీనినిబట్టి అణిచివేయబడినవారికి—ధనవంతులమీద, అదృష్టవంతులమీద వుండేకోపం ఏసుకు కూడా వున్నదని రుజువవుతున్నది.

"అయ్యో! ఇప్పుడు కడుపునిండివున్న వారలారా, మీరు ఆకలిగొందురు. అయ్యో! ఇప్పుడు నవ్వుచున్న వారలారా, మీరు దుఃఖించ పడ్తారు. మనుష్యులందరూ మిమ్మును కొనియాడు నప్పుడు మీకుశ్రమ; వారి పితరులు అబద్ధ ప్రవక్తలకు అదేవిధముగా చేసిరి." (లూకా 6; 25-26)

ఏసుబోధలు చారిత్రాత్మక పరిధిలో అర్థము చేసుకోవలెను. "రేపటి సంగతి పట్టించుకోవద్దు. అనే వాక్యం ప్రపంచం త్వరలో నశిస్తుంది అనే నమ్మకంవల్ల పుట్టింది. చెడును వ్యతిరేకించవద్దు." "మరొక చెంపను చూపుము" అను బోధలు రోమను సైనికులచేత అణచి వేయబడుతున్న పాలస్తీనా యూదుల పరిస్థితికి తగిన సలహా. కాని ఇది సర్వసామాన్యంగా అందరికీ వర్తించదు. ఈ సలహాను అందరికీ అన్ని సందర్భాలలో వర్తింప జేస్తే కపట వర్తనకు, నైతిక అయోమయానికి దారితీస్తుంది.

## శాశ్వతశిక్ష

నరకాన్ని గురించి ఏసు ప్రవచనాలవల్ల చాల దుర్భరమైన సామాజిక దుష్ఫలితాలు సంభవించాయి. ఈ అంశాన్ని రోమన్ కేథలిక్ శాఖవారు ఇప్పటికీ ప్రచారం చేస్తున్నారు. ప్రతీకగా మాత్రమే ఏసు చెప్పాడని దీనికి వివరణ ఇవ్వాలనికొన్ని శాఖలవారు ప్రయత్నిస్తున్నారు. అయినా నరకాన్నిగూర్చి ఏసు పదేపదే చెప్పినందువల్ల ఈ సంజాయిషీని మనం అంగీకరించటానికి వీలులేదు.

చాలామంది బైబిలును పూర్తిగా చదవరుకనుక వారికి ఏసుమాటలు పరిచితంకావు. ఆయన నరకాన్ని గురించి చేసిన ప్రసంగ పాఠాలను ఈ దిగువన వివరిస్తున్నాను.

"మనుష్య కుమారుడు తన దూతలను పంపును; వారాయన రాజ్యంలో నుండి అటంకములగు సకలమైన వాటిని, దుర్నీతి పరులను సమకూర్చి అగ్ని గుండంలో పడవేయుదురు. అక్కడ ఏడ్పును, పళ్ళు కొరుకుటయును వుండును." (మత్త. అ. 13 వా. 41-42).

"అప్పుడాయన ఎడమవైపు వుండువారిని చూచి — శపించబడిన వారలారా, నన్ను విడిచి అపవాదికి(సాతాను) వాని దూతలకును సిద్ధపరచబడిన నిత్యాగ్నిలోనికి పోవుడి.... వీరు నిత్య శిక్షకును, నీతిమంతులు నిత్య జీవనమునకును పోవుదురు." (మత్త. అ. 25 వా. 41, 46)

"దేహమును చంపిన తర్వాత మరేమియు చేయనేరని వారికి భయపడకుడి. ఎవనికి మీరు భయపడవలెనో మీకు తెలియ జేయుదును; చంపిన తర్వాత నరకంలో పడద్రోయ శక్తిగలవానికి భయపడుడి. ఆయనకే భయపడుడని మీతో చెప్పుచున్నాను." (లూకా అ. 12 వా. 4, 5)

"పరిశుద్ధాత్మ విషయము దూషణచేయు వాడెప్పుడును క్షమాపణ పొందక నిత్యపాపము చేసినవాడై వుండును." (మార్కు అ. 3. వా. 29)

"తన సహోదరుని చూచి వ్యర్థుడా అని చెప్పువాడు మహాసభకు లోనగును; ద్రోహి అని చెప్పువాడు నరకాగ్నికిలోనగును." (మత్త. అ. 5 వా. 22)

"నీచెయ్యి నిన్ను అభ్యంతర పరచినయెడల దానినినరికివేయుము; నీవు రెండు చేతులు కలిగి నరకంలోని ఆరని అగ్నిలోనికి పోవుటకంటే అంగహీనుడవై జీవంలో ప్రవేశించుట మేలు." (మార్కు అ. 9 వా. 43)

లూకా సువార్త 16వ అధ్యాయంలో 19 నుండి 31 వరకున్న వాక్యములలో తన వాకిలివద్ద పడియున్న లాజరును నిరాదరణచేసిన ధనవంతుని కథ వున్నది. అతడు పడిన నరకయాతన వివరముగా వర్ణింప బడింది. ఇలా నరకాన్ని భయానకంగా చిత్రించి శ్రోతలను ఏసు భయపడచేసెను. ఒకవైపున భగవంతుడు దయామయుడని చెప్తూ మరియొకవైపున తనను సంతోష పెట్టనివారిని నరకంలో క్రూరంగా హింసిస్తాడని ప్రకటించబడింది. నిజానికి క్రైస్తవమతం రెండు నాల్కలతో మాట్లాడుతుంది.

నరకాన్ని ఏసు సృష్టించలేదు. ఏసుకు పూర్వమే యూదు ప్రవక్తలు మరణాంతర జీవితాన్ని గురించి మాట్లాడారు. అయితే ఏసు ఆ భావాన్ని ఎందుకు అంగీకరించాడనేది. ప్రశ్న.

నరకాన్ని ఒక అలంకారంగా మాత్రమే వాడాడని చేసేసమర్థన నిలవదు. ఎంత చెడ్డవారినైనా అంతగా హింసించే దేవుడు క్రూరుడుకాక తప్పదు.

దేవుడు మానవునికి స్వేచ్ఛా సంకల్పశక్తిని ఇచ్చాడని, అతడు దుష్ట కార్యాలు చేసి నరకానికిపోతే దేవుని బాధ్యతలేదని ఒక వాదన ప్రబలంగా వుంది. దేవుని నుండి విడివడడమే బాధాకరమైతే ఎవరూ దానిని ఆశించరు. నిజానికి దేవుని మాటను కాదన్నందుకే దేవుడు మనిషిని తన నుండి దూరంచేశాడు. వాదనకోసం మానవుడే బుద్ధిపూర్వకంగా దేవుని నుండి వేరుపడినాడని భావించినా, అతడు ఆ చర్యవల్ల కలిగే దుష్ఫలితాలను ఆశించలేదు కదా! అలాంటప్పుడు అతనిని శిక్షించుట ఏమిన్యాయం?

నరకాన్ని గురించి ఏసు చేసిన ప్రసంగాలు సామాజిక జీవితంలో భయాన్ని, నైచ్యాన్ని, క్రూరత్వాన్ని, సహజమైన మానవ సానుభూతిని

విధ్వంసం చేయడాన్ని పెంపొందించాయి. ఈ సందర్భంలో అన్ని మతాలకన్నా క్రైస్తవం మానవజాతికి ఎంతో అపచారం చేసిందనక తప్పదు.

## ఆలోచనాపద్ధతికి వ్యతిరేకత

ప్రపంచంలోని గొప్పనైతిక ప్రవక్తలలో ఏసును, సోక్రటీసును పేర్కొనడం కద్దు. తమ ప్రవచనాలు ఆ కాలానికన్నా ముందున్నందు వల్ల వారు చంపబడినారని ఒక వాదం వుంది. వాస్తవానికి వారిరువురి లక్ష్యాలూ, వుద్దేశ్యాలూ పరస్పర విరుద్ధాలు.

ఏసు, సోక్రటీసుల బోధలు ఎంతో తేడాతో వున్నాయి. సోక్రటీసు వివేకవంతులైన యువకులకు బోధచేశాడు. ఆలోచించమని హెచ్చరించాడు. సాక్ష్యాధారం లేకుండా దేనినీ నమ్మవద్దన్నాడు. మానసిక పరిపక్వతను పెంపొందించుకోమన్నాడు. తద్విరుద్ధంగా ఏసుశిష్యుడు నిరక్ష్యరాస్యులైన రైతులు విమర్శనా రహితంగా నమ్మవలసిందని, ప్రశ్నించకుండా విధేయతను ప్రదర్శించమని ఏసు శిష్యులను ఆదేశించాడు. వారిని శిశువులుగా పరిగణించాడు. వయోజనులకన్నా శిశువులు గొప్పవారని ప్రకటించాడు. "మీరు మార్పునందు బిడ్డలవంటి వారైతేనే కాని పరలోక రాజ్యంలో ప్రవేశింపరని మీతో నిశ్చయంగా చెప్పుచున్నాను. (మ. అ. 18. వా. 3)

"ఆకాశమునకును భూమికిని ప్రభువా, నీవు జ్ఞానులకును వివేకులకును ఈ సంగతులను మరుగచేసి పసిబాలురకు జయులు పరచినావని నిన్ను స్తుతించు చున్నాను." (లూకా అ. 10 వా. 21) వయోజనులు పసిపిల్లల వలె వ్యవహరించుట ఎంత అనుచితమో మనందరికీ తెలుసు.

ఆలోచనాపరులైన వయోజనులు ఏసును రక్షకుడుగా అంగీకరించక ప్రశ్నలు వేయుటవలన ఏసు మానసికంగా యెదగని శిష్యులకోసం తాపత్రయపడ్డాడు. తన రక్షకత్వానికి సాక్ష్యం చూపమని అడిగినవారిని ఏసు నిరసించాడు. "వ్యభిచారులైన చెడ్డతరమువారు సూచక క్రియ అడుగుతున్నారు. అయితే యోహానుగూర్చిన సూచక క్రియయేగాని

మరి ఏ సూచక క్రియయైనా వారికి అనుగ్రహింపబడదని వారితో చెప్పి వారిని విడిచి వెళ్ళిపోయెను.” (మ. అ. 16 వా. 4)

ఏసుకు విద్య అన్నా, తెలివితేటలన్నా అపనమ్మకం. పౌలుకూడా ఇదే భావన వెలిబుచ్చాడు. మీలో ఎవరైనను ఈ లోక మందు తాను జ్ఞాని అనుకొనినయెడల జ్ఞాని అగునట్లు వెఱ్ఱివాడు కావలెను. ఈలోక జ్ఞానము దేవుని దృష్టిలో వెఱ్ఱితనమే. జ్ఞానులను వారి కుయుక్తిలో ఆయన పట్టుకొనును మరియు జ్ఞానుల యోచనలు వ్యర్థములని ప్రభువునకు తెలియును.” (1 కొరింధి అ. 4. వా 18-21)

క్రైస్తవము అమాయకులను తనలో చేర్చుకోవాలని ప్రయత్నిస్తుంది ప్రశ్నించవద్దని, గ్రుడ్డిగా నమ్మమని, విశ్వాసమే రక్షిస్తుందని, వివేకము దుష్టమని, తెలివి తక్కువ తనం గొప్పదని ప్రచారం చేస్తుంది. అనేక శతాబ్దాలుగా మానవునికి వివేకము యెడల భయ, సందేహాలను కలుగజేసింది. మానవుడిలో మానసికాభ్యున్నతిని వ్యతిరేకించడంలో క్రైస్తవం దానికదే సాటి.

## సెక్సు వివాహం

ఏసు అవివాహితుడు. యూదులకు వివాహం విధ్యుక్తధర్మం అవడంతో వారి భాషలో బ్రహ్మచారి అనే పదమే కనపడదు. 'ఎస్సెనీ' అనే ఒక తెగ మాత్రం బ్రహ్మచర్యం పాటించింది. బహుశా ఏసు వారి మతంలో కొంతకాలం గడిపి వుండవచ్చు.

కుటుంబ బంధాలను, కుటుంబీకుల యెడల ప్రేమాభిమానాలను, ఎలా వదిలివేయమన్నాడో అలాగే లైంగిక ప్రేమకు దూరంగా వుండమన్నాడు. “పరలోక రాజ్యం నిమిత్తం తమను తామే నపుంసకులుగా చేసికొనిన వారిని” (మ. అ. 19 వా 12) ఏసు పొగిడాడు. పరలోక రాజ్యంలో వివాహం వుండదని చెప్పాడు. “పరమున మృతులు పునరుద్ధానమును పొందుటకు యోగ్యులని ఎంచబడినవారు పెండ్లి చేసుకొనరు. పెళ్ళి కీయబడరు.” (లూకా. అ. 20 వా. 35) దీనినిబట్టి సహజమైన మానవ ప్రవృత్తి ఎడల ఏసు ఆసక్తుడు కాడని తేలుతుంది. మార్తామరియల

యెడల స్నేహభావం చూపడం, ఒక వివాహానికి వెళ్లడం, వ్యభిచారిణిని ప్రజలు దండించకుండా నివారించడం (యోహాను అ. 8 వా 7) ఇవి ఏసు యొక్క వైఖరికి నిదర్శనములు. కాని ఏసు శిష్యుడు పౌలు లైంగిక ప్రేమను పూర్తిగా నిరశించాడు. "నేనే భ్రష్టుడనై పోదునేమో యని" నా శ రీ ర ము న లగ గొ ట్టి దానిని లోపరుచుకొను చున్నాను. (కొరిం—అ. 10 వా, 27)

దీనినిబట్టి శరీర ధర్మాన్ని, పౌలు వ్యతిరేకించినట్లు స్పష్టమవుతుంది. అతడు అంతటితో ఆగలేదు. "స్త్రీని ముట్టకుండుట పురుషునికి మేలు." (1 కొరిం అ. 7 వా. 1) "నావలె నుండుట వారికి మేలని పెళ్ళికాని వారితోనూ, విధవరాండ్రతోనూ చెప్పుచున్నాను. అయితే మనస్సు నిలుపులేనియెడల పెళ్ళి చేసుకొనవచ్చును. కామ తప్తు లగుటకంటే పెళ్ళి చేసుకొనుటమేలు; (1 కొ. అ. 7 వా. 9) దీనినిబట్టి వివాహస్థితికి పౌలు ద్వితీయ స్థానం ఇచ్చాడని నిర్ధారణ చేయవచ్చును. ఏదయిన ఏసు మాటలకు పౌలు వ్రాతలకు విపరీతార్థాలు కల్పించి రోమన్ కేథలిక్కు మత గురువులు క్రైస్తవ మతపు తొలిదశలో మానవ జీవితాన్ని సుఖసంపన్నం చేసే లైంగిక ప్రేమను ఈసడించడం జరిగింది.

ఇలా ప్రేమ, వ్యక్తిగత సంబంధాలు మానవ సౌభాతృత్వం పర లోక భావన నరకంలో శాశ్వతమైన శిక్ష, వివేచన వ్యతిరేకత, వివాహం మొ॥ అంశాల విషయంగా ఏసు ఆలోచనలు, క్రైస్తవమత భావనలు ఆదరణీయాలు కావు. పరిశీలకులను, విమర్శనాయుత అధ్యయనపరులను తృప్తి పరచవు. ధనబలాన్నీ, రాజకీయ ప్రాబల్యాన్ని, ప్రచారన సంపత్తికి జోడించి క్రైస్తవమతంవ్యాప్తి జెందినంత మాత్రాన దాని మౌలిక సూత్రాలను గుడ్డిగా, బండగా అంగీకరించాల్సిన అగత్యం లేదని మార్గరెట్ నైట్ గ్రంథాన్నిబట్టి తేలుతుంది. *

# క్రైస్తవము: రోమన్ కేథలిక్‌శాఖ

ఈనాడు కొంతగా కొంత గెలీలియో, డార్విన్ల సిద్ధాంతాలను రోమన్ కేథలిక్‌శాఖ ఆమోదించినా మొత్తం మీద మధ్యయుగపు స్థితిలోనే ఆ శాఖ వున్నది. అసహనం, అధికార మనస్తత్వం, పరలోకభావన ఏవీ తగ్గలేదు. ఇప్పటికీ నరకంలో విశ్వాసాన్ని అది పెంపొందిస్తూనే వున్నది.

అసహనం :- తనదే సరియైన క్రైస్తవమని, తన చర్చి పొరపాటు చేయటానికి అవకాశంలేదని రోమన్ కేథలిక్కులు నమ్ముతారు. ఇటీవల కొద్దిగా అసహనం తగ్గినట్లు కనిపించినా ఇప్పటికీ ఆ శాఖ వైఖరి 1929 లో పదకొండవ పయస్ అనే పోపు నిర్వచించినట్లుగానే వున్నది. "కేథలిక్ రాజ్యంలో భావస్వాతంత్ర్యం, చర్చాస్వాతంత్ర్యం అనే వాటిని కేథలిక్కు సిద్ధాంతానుగుణంగాను, కేథలిక్కు సూత్రాలకు అనుకూలంగానూ అర్థం చేసుకొని ఆచరించడమే" ఇవి ఇప్పటికీ శిరోధార్యాలుగా వున్నాయి. ప్రతి వ్యక్తికీ మత స్వేచ్ఛ వుందనీ, తన ఇష్టంవచ్చినట్లు పూజచేసుకొనే హక్కు వుందనీ చెప్పడం చిత్తచాంచల్యంతో సమానమని 1832 లో పోపైన 16 వ గ్రెగరీ చెప్పాడు. 1948 లో ఈ శాఖకు చెందిన తీవ్రవాదవర్గమైన జెసూట్ల పత్రిక ఇలా రాసింది. "రోమన్ కేథలిక్ చర్చి దైవదత్తమైనది; అదే సత్యమైనది. కనుక మరోరకపు చర్చికి మనుగడ కలిగివుండటానికి ఆస్కారం లేదు. ఒకవేళ ఇతర మతస్థులూ, ఇతర శాఖలవారూ వున్నా వారు మత ప్రచారము చేసుకొనుటకు హక్కువుండరాదు. కొన్ని దేశాలలో అందరికీ మత స్వేచ్ఛను రోమన్‌కేథలిక్కు శాఖవారు కోరడం తటస్థిస్తున్నది. వాస్తవ పరిస్థితులను గుర్తించడంవల్ల అలా జరుగుతున్నదే కాని ఇతరత్రా కాదని గ్రహించవలెను." ఈ పై వాక్యాలను అందరు రోమన్‌కేథలిక్కులు ఆమోదించినట్లు కన్పడదు; కాని 1965 వరకూ వీటినెవరూ నిరశించలేదు. ఆనాటి పోపు 13వ జాన్ ప్రోద్బలంతో ఉన్నతోన్నతమైన వేటికన్ సమితి ఒక ప్రకటన చేసింది. "తమ విశ్వాసానికి భిన్నంగా ఎవరినీ వ్యక్తులుగాని, సామాజిక సముదాయాలుగాని, ఏ మానవశక్తిగాని మత విషయంలో నడుచుకొమ్మని ఒత్తిడిచేయరాదు. అందరు మానవులకు మతస్వేచ్ఛవున్నది. తగిన పరిధిలో తమ మతాలను అనుసరించడానికి ఎవరినీ అడ్డుపరచరాదు." ఈ ప్రకటనచాలా ఔదార్యంతో కూడుకున్నట్లు కనబడుతుంది. కాని దీని

ఉపక్రమణిక చూస్తే బండారం బైటపడుతుంది. "మత స్వేచ్ఛ ఇచ్చినంత మాత్రాన సత్యాన్ని, ఆ సత్యాన్ని సరిసమానంచేసే హక్కు ఎవరికీలేదు; అలాగే మతాన్ని గురించిన సరియైనభావన ఏర్పరచుకోవలసిన బాధ్యతను ఎవరూ విస్మరించలేరు. దేవుని సేవించవలెనా, లేదా, లేక ఏ మతాన్ని అను సరించాలి, లేక ఏవిధంగా దేవుని పూజించవలెననే అంశాన్ని ఏ మానవుడూ తన ఇష్టంవచ్చినట్లు నిర్ణయించటానికి వీలులేదు. కేథలిక్ చర్చి మాత్రమే సత్యమైన చర్చిఅని అలాగే కేథలిక్ మతబోధ మాత్రమే సరియైన మత సిద్ధాంతమని ప్రకటించే సూత్రాలను ఈ మతస్వేచ్ఛా సిద్ధాంతం భంగ పర్చదు." అంటే 1832 లో చేసిన ప్రకటన యొక్క ఆంతర్యాలను ఈ ప్రకటన దాటిపోవటంలేదు.

ఈ మధ్య క్రైస్తవంలో అన్ని శాఖలను కలిపి 'సర్వసామాన్య క్రైస్తవోద్యమం' **(Ecumenical Movement)** ప్రారంభించబడింది. మానవవాదం యొక్క దెబ్బను తట్టుకోడానికి ఈ ఉద్యమం పుట్టింది. అంత మాత్రాన తతిమ్మా శాఖలను రోమన్‌కేథలిక్కు శాఖ సమదృష్టితో చూస్తుం దని కాదు, ఎప్పటికైనా తతిమ్మా శాఖలను కబళించడమే కేథలిక్ మతస్తుల ఐక్యతా నినాద అంతరార్థం. ఈ సందర్భంగా వేటికన్ చేసిన ప్రకటన గమనార్హం. "కేథలిక్ శాఖకు ఉన్న ప్రత్యేకత తతిమ్మా శాఖలకు లేదు. ఈ శాఖలో ఏసుకు, చర్చికి ఐక్యత ప్రతిపాదించబడింది. ఈ శాఖద్వారానే మానవుడు ముక్తి పొందగలడు." ఈ ప్రకటన వెనుక దాగివున్న భావన ఇతర శాఖలవారు ఎంత త్వరగా గుర్తిస్తే అంత త్వరగా సర్వసామాన్య క్రైస్తవోద్యమం ముసుగునుండి వారు బైటపడతారు.

<u>అధికారవైఖరి</u> :- సిద్ధాంత విషయంలోనూ, నీతి విషయంలోనూ కేథలిక్‌శాఖ అధికార వైఖరిని ప్రదర్శిస్తున్నది ఇది మానవవాద వైఖరికి వ్యతిరేకం. నీతి పర్వాలకు కావలసినదే. సహకార జీవనం సాగవలెనంటే నిజంచెప్పటం, వాగ్దానాలను నిలుపుకోవడం మొ॥ నీతి సూత్రాలను మాన వుడు పాటించాల్సివుంటుంది. ఇది మానవ సంక్షేమం దృష్ట్యా జరుగుతుంది. అవసరాన్ని బట్టి ఈ సూత్రాలకు మినహాయింపు లుంటాయి. దుర్మార్గుడైన, ఫాసిస్టు హిట్లరు అనుచరుల బారినుండి స్వేచ్ఛాకాముకుని రక్షించేనిమిత్తం అబద్ధమాడడం అవినీతికాదు. మానవవాద నీతిలో మానవ సంక్షేమానికి

ప్రాధాన్యత వుంటుంది. అలాకాక కేథలిక్కు నీతిలో-ఆమాటకొస్తే ఏ మత నీతిలోనైనా ప్రకృతికి అతీతమైన శక్తియొక్క సంకల్పానికి విలువ ఇవ్వబడుతుంది. ఉ॥ కుటుంబనియంత్రణ విషయం తీసుకుంటే జన్మనిగ్రహం పాపమని కేథలిక్కులు వాదిస్తారు. దానికి బైబిల్లో ఓనాన్ కథను ఉటంకిస్తారు. చనిపోయిన సోదరుని భార్యకు గర్భధారణ చేయనిరాకరించడం పాపమని ఆ కథ సారాంశం. ఆకథలోని నీతిని వక్రీకరించి జన్మనిగ్రహాన్ని వద్దని శాసించి మానవజాతిని అష్టకష్టాలపాలు చేస్తున్నది కేథలిక్కుశాఖ. జన్మనిగ్రహం ప్రకృతి విరుద్ధమట! మరి గడ్డం చేసుకోవటం ప్రకృతి విరుద్ధంకాదా? అసంబద్ధమైన తర్కంలో మానవ సంక్షేమ, వినాశకర విధానాలను ఆ శాఖ నిర్దేశిస్తున్నది కుటుంబనియంత్రణ విషయంలో చాలామంది విద్యావంతులైన కేథలిక్కులు చర్చికి ఎదురు తిరిగారు. పోప్ పాల్ నూతన సూత్రీకరణ చేస్తాడని పలువురు భావించారు. కాని అనుకున్నంత మార్పేమీ రాలేదు. కారణం ఒకటే ఒకటి. పోపులంతా దైవస్వరూపులు; కనుక వారి ప్రవచనాలు దివ్యవాక్కులు. వాటిలో పొరపాటువుండదు. కనుక పూర్వపు పోప్ చేసిన ప్రకటనను తరువాతి పోప్ కాదనరాదు. కాకపోతే దానికి భాష్యం చెప్పవచ్చును. ప్రజలు దానిని సరిగా అర్థంచేసుకోలేదని క్రొత్త అర్థాన్ని ఇవ్వవచ్చు. ఈ సూత్రాన్ని అనుసరించి పోప్‌పాల్ ఉదారమైన ప్రకటన చెయ్యలేక పోయ్యాడు.

గర్భస్రావానికి వ్యతిరేతంగా 1930 లో ఆనాటి పోప్ 11 పయస్ ప్రకటన చేసాడు, ఇటీవల 1947 లో వచ్చిన ప్రకటన ద్వారా పాత ప్రకటన యొక్క తీవ్రత తగ్గించబడింది. ఆ వైఖరిని ప్రశ్నోత్తరాల రూపంగా వివరించడం జరిగింది. మామూలుగా ప్రసవమైతే తల్లి పిల్లా చనిపోవడం ఖాయమని తేలినప్పుడు, పిండాన్ని తీసేస్తే తల్లి ప్రాణాన్ని రక్షించవచ్చని వైద్యుడు అభిప్రాయపడినా అలాచేయడం గర్భస్రావంతో సమానమని ప్రకటన సారాంశం. ఇది ఎంత అమానుషమో గ్రహించాలి. మానవ ప్రాణాలకు ఏమి జరిగినా ఫరవాలేదనే ఈరకపు నీతి సూత్రాలను 1955 లో ఒక కేథలిక్ వనిత బేకెన్‌హేమ్ ప్రభ్వి సమర్థించింది. ఎవరు చనిపోవాలో, ఎవరు బ్రతకాలో నిర్ణయించేది దేముడే; అంతేకాని డాక్టరూకాదు, భర్తాకాదు. మనం చనిపోతే దేముడు నిర్ణయించిన కాలానికిముందు చనిపోయినట్లు కాదు." ఎంత వింత సమర్థనో గమనించండి! అకాలమరణాన్నిచూచి అనాగ

రికులు భయపడతారట! భార్యను కోల్పోయిన భర్త, ఆమెకు అంతకు ముందు పుట్టిన పిల్లలూ ఈ తర్కాన్ని ఆమోదించగలరా? గ్రీకులను, రోమన్లను గురించి అనాగరికులని లేక మతరహితులని ఆమె భావించి వుండవచ్చు. కాని ఉదాత్తమైన ఉద్యమం కోసం తృణప్రాయంగా వారు ప్రాణాలను ఒడ్డేవారు.

ఇప్పుడు కొంతమంది కేథలిక్ వైద్యులు తల్లిప్రాణాన్ని రక్షించే నిమిత్తం పిండవిచ్ఛిత్తి చేస్తున్నారు. కాని ఇప్పటికి ఇది కేథలిక్ సూత్రానికి వ్యతిరేకమైనదని గుర్తించవలసి వుంటుంది. ఇలా నీతి విషయికంగా అధికారవైఖరిని ప్రదర్శించి మానవ సంక్షేమాన్ని విస్మరిస్తుంది కేథలిక్కు క్రయిస్తవం.

బైబిలు సువార్తలలోని నీతి పరలోకదృష్టి కలిగివుంది. కొలది కాలంలో ఈ ప్రపంచం నశిస్తుందని రోమన్ కేథలిక్కులు ఇప్పుడు చెప్పటం లేదు. కాని పోపుగావున్న 11వ పయస్ చెప్పినమాటలు గమనార్హం. "మానవుడు ఈ ఐహిక జీవితంకోసం, ఈ ప్రపంచంకోసం పుట్టించబడలేదు; స్వర్గంకోసం, శాశ్వతత్వంకోసం అతడు జన్మించా..." ఈ మాటలు మత గురువులను ఉద్దేశించి మాత్రమే చెప్పలేదు. ఆ శాఖకు చెందిన క్రైస్తవు లందరి కోపం పలికిన మాటలు ఇవి. " ఈ జీవితంలో నీవు చేసేపని తర్వాత వచ్చేదానికి సంబంధం కలిగివుంటుంది; మరణానంతర పరిస్థితి ముఖ్యమైనది." అని సుప్రసిద్ధ రోమన్ కేథలిక్ ఛార్లెస్‌కురాన్ ఉద్ఘాటించాడు. ఆయన బ్రిటన్‌లోని ఆకాశవాణికి అధిపతి అని చెప్తే ఆయన హోదా ప్రాముఖ్యత తెలుస్తుంది. "ఈ భూమిమీద జీవితం మానవజాతికి ఉత్కృష్టలక్ష్యమైన వాస్తవ జీవితానికి సోపానం." అని 'టాబ్లెట్' పత్రిక సంపాదకుడు డగ్లస్ ఉడ్‌రఫ్ స్పష్టీకరించాడు. ఉదజని బాంబువల్ల సంభవించే వినాశాన్ని గురించి ప్రసంగిస్తూ ప్రఖ్యాత మతస్థుడొకడు ప్రకటించిన అభిప్రాయం ఎంత విడ్డూరమో గమనిద్దాం. "పొరపాటున ఈ ప్రపంచం యివత్తూ సర్వనాశనమైనా నాకేమీ అభ్యంతరం లేదు." అంటే బుద్ధి పూర్వకంగా బాంబు వేస్తే, ఈ ప్రపంచం నశనమైతే అది హత్యాపాపం క్రిందవస్తుంది. అందుకని మనస్సును సమాధాన పర్చుకోవడానికి అలా డొంక తిరుగుడుగా చెప్పాడు ఆ పెద్దమనిషి.

పరలోక దృష్టి కలిగిన ఈ శాఖ క్రైస్తవులకు ఈ ప్రపంచంలో వున్న బాధలు, అన్యాయాలు పట్టవు. అంతేకాదు మానవ వేదనయొక్క ఉదాత్త స్వభావాన్ని గురించి వారు స్తోత్రపాఠాలు వల్లిస్తారు. జీవిస్తాడనే నమ్మకం లేని వ్యక్తి తాను ఆత్మహత్య చేసుకోడానికి హక్కు వుండాలనే

వాదనలు నిరశిస్తూ కేథలిక్కు మహిళాసంఘం "బాధవల్ల కూడా కొంత మేలు కలుగుతుంది" అని ప్రకటించింది.

బీదరికము, లేమి, ఈ రెండూ వ్యాధి బాధలతో సమానస్థాయిలో పుణ్యాన్ని పొందటానికి సాధనాలుగా పేర్కొన్నారు. "సుఖము, సంపద ఈ రెండూ ఏజాతికి కాని, వ్యక్తికిగాని మంచివి కావని ఒక ప్రసిద్ధ మత గురువు ప్రకటించాడు. ఈ సిద్ధాంతము ధనవంతులకు మాత్రమే లాభకరం. బీదవారు తమస్థితికి తృప్తిపడటానికి ఇది బాగా వుపకరిస్తుంది. ఈ సందర్భంగా నెపోలియన్ చెప్పిన మాటలు సందర్భోచితంగా వుంటాయి. మతం లేకుండా రాజ్యం మన జాలదు. సంపద విషయంలో అసమానత్వం లేకుండా సమాజం మనజాలదు. మతంలేని అలాంటి సమాజం సాగదు. ఒకడు తిండిలేకచస్తుంటే మరొకడు అజీర్తితో బాధపడుతుంటే "ఈ ప్రపంచంలో ధనవంతులు బీదలు వుండాలని సంకల్పిస్తున్నాడు; కాని తర్వాత జీవితంలో, శాశ్వత దశలో ఇలాంటి వేర్పాటు ఉండదు" అని అధికారికంగా చెప్పే వ్యవస్థ లేకపోతే బీదవాడు ఈ తేడాను ఎందుకు సహించి ఊరుకుంటాడు?" ఇలా సాగింది నెపోలియన్ వాదన.

పరలోకంలో ఆనందం లభిస్తుందనే భ్రమతో ఇలా ఈ ప్రపంచాన్ని ఆనంద ప్రాప్తిని క్రైస్తవులు వొదులుకుంటారో ఈ క్రింది ఉదాహరణల వల్ల తెలుస్తుంది. సోదరమానవుల ఆత్మల సముద్ధరణ కోసం మౌన వ్రతాన్ని పాటించిన సన్యాసి జీవితాన్ని రాబర్టు లూయీ స్టీవెన్ సన్ అనే పేరుగల ఇంగ్లీషు గద్యకవి వర్ణించాడు. "స్వర్గానికి పోతాననే నమ్మకం నాకు లేకపోతే నేను ఈ మఠంలో వుండే వాణ్ణికాను." అని ఒక సన్యాసి టెలివిజన్‌లో చెప్పాడు. తమ ఆత్మను రక్షించుకోవటానికే ఈ సన్యాసులు తాపత్రయ పడుతున్నారు. ఇటీవల ఈ శాఖ క్రైస్తవుల దృష్టిలో కొంత మార్పు వస్తున్నది. బహుశః వెనుకబడిన దేశాలలో అది కమ్యూనిజం వ్యాప్తి ఫలితమే! సామాజిక సమస్యలపై దృష్టిని కేంద్రీకరిస్తున్నారు కొందరు యువతరపు కేథలిక్కులు. అయినా యువతరంలో అధిక సంఖ్యాకులు సనాతన భావాలనే సమర్థిస్తున్నారు. మతం వ్యక్తిగతమై కూర్చుంది; అంటే మతం వ్యక్తిగత మోక్షానికి విలువనిస్తున్నది అన్నమాట! వ్యక్తిగత సద్గుణాలకు సామాజిక జీవిత విషయాలకు ప్రాముఖ్యత ఇవ్వడం లేదు. ఇది వారి వైఖరి.

<u>నరకము</u> :— నరకాగ్నులను గురించి కేథలిక్కు శాఖవారు తు. చ. తప్పకుండా నమ్ముతారని అంటే ఇతరులు నమ్మరు. కాని అది నగ్నసత్యం. 'నరకం' అనే కరపత్రాన్ని కేథలిక్కు సత్యసంఘంవారు ప్రకటించి 60

వేల కాపీలు అమ్మినారు. అది ప్రశ్నోత్తర రూపంగా రాయబడింది. దేవునితో శతృత్వంగల మానవులు, దయ్యాలు శాశ్వతంగా యాతన అనుభవించే ప్రదేశమే నరకమట. అచ్చట ఆత్మలు వాస్తవమైన అగ్నిలో కాల్చ బడతాయట. కొత్తనిబంధనలో ఈ నరకాన్ని గురించి 30పర్యాయాలు చెప్పబడిందట. కొన్ని ఆత్మలు నరకంలో బాధ పడాల్సివస్తే అటువంటి ఆత్మలను దేవుడు ఎందుకు సృజించాడు అనే ప్రశ్నకు భగవంతుని అనంత మైన వివేకాన్ని ప్రశ్నించుటకు మనం ఎంతవారము అని జవాబు ఇవ్వ బడుతుంది. నరకంలో ఉండే పాపులను కరుణించరాదట. ఈ కరపత్రం ప్రస్తుతం చలామణిలో లేనందున దీనిలోని విషయాలను ఉటంకించరాదని కొందరనవచ్చు. కాని 1971లో బ్రిటన్‌లోని మతగురువులచే ఆమోదింప బడిన ప్రశ్నోత్తరమాల ఈ సందర్భంగా అనుమానాన్ని పటాపంచలు చేస్తుంది. పాపం చేసి చనిపోయినవారు నరకానికి పోతారట. దుర్మార్గులకు శాశ్వతంగా నరకంలో స్థానమున్నదట. 1967లో ప్రకటింపబడిన "శాశ్వత జీవితము" **(Life for Ever)** అనే కరపత్రంలో నరకయాతన కంటే ఏబాధఅయినా మెరుగేనని క్రీస్తు కొండమీద ప్రసంగంలో రాయబడింది. దేవుని కాదంటే నరకబాధ తప్పదని చెప్పాలని సృష్టికరించ బడింది.

ఈ చిన్న చిన్న కరపత్రాల సంగతెందుకు. 1971లో పోపుపాల్ ఏమన్నాడో తెలుసుకోక తప్పదు. "నరకమనేది భయంకర సత్యం.... మన భవిష్య జీవితాన్ని గురించి మనం గమనించడం లేదు. శాశ్వతమైన శిక్షకు స్థానంగా వుండే నరకాన్ని గురించి భిషప్పుల సంఘం మనకు పదే పదే హెచ్చరిస్తుంది. నరకాన్ని గురించి క్రీస్తు ఏనాడు సందేహం వెలి బుచ్చలేదు. ఈ పోపుకు ముందుగా ఆ పదవిని అధిష్టించిన 13వ లుయిన్ విద్యార్థి దశలో దినచర్య రాశాడు. అందులో నరకానికి పంపవద్దని క్రీస్తును ప్రార్థించాడు. ఇది 1900 సంవత్సరపుమాట. కాని ఈ కాలంలో కూడా కేథలిక్కు మత కళాశాలలలో విద్యార్థులు ఇలాంటి భయసందేహాలకు లోనౌతున్నారని చెప్పడం నేరం కాదు. మార్గరేట్‌సైట ఈ విషయాలను గూర్చి ప్రసంగిస్తున్నప్పుడు ఒక సన్యాసిని తన అభ్యంతరాన్ని ప్రకటించిందట. చిన్న పిల్లలకు నరకాన్ని గూర్చి మేము చెప్పం అని ఆమె ప్రకటించిందట. ఏ వయస్సు దాటిన పిల్లలకు నరకాన్ని గురించి పాఠం చెప్తారని అడిగితే ఏడు ఏళ్ళు దాటితేకాని ఈ ప్రసక్తి తీసుకొని రాము అని చెప్పారామె. ఇంత లేత వయస్సులో నరకాన్ని గురించి, నరకయాతనలను గురించి విద్యార్థులను భయభ్రాంతులను చేయడం కేథలిక్కులకే చెల్లుతుంది.

# క్రైస్తవం - ప్రొటెస్టెంటు శాఖ

క్రైస్తవ మతంలో బహుళ సంఖ్యాకుల ఆమోదాన్ని పొందినది ప్రొటెస్టెంటు శాఖ రోమను కాథలికుల నుండి విడిపోయి ఏర్పడింది ఈ శాఖ. వీరి పూజా విధానం కాథలికుల పూజా విధానమునకు భిన్నము; వీరు ఏసు తల్లి మేరీమాతను ఆరాధించరు. వీరిలో అధునాతనులు ఏసునుకూడా ఆరాధించరు; ఏసును ఉత్తమ మానవునిగా పరిగణిస్తారు.

వీరు విడాకులను ఆమోదిస్తారు. కుటుంబనియంత్రణకు అనుకూలురు; జన్మనిగ్రహ సాధనాల వాడకానికి వ్యతిరేకులుకారు. అదీగాక బైబిలులోని ప్రతి కథను వాస్తవంగా పట్టుపట్టి ప్రచారం చేయరు. కొన్నింటిని మానవులు విశ్వసించటానికి వీలులేనివని అంగీకరిస్తారు. దేవుని కరుణను పొందటానికి మతాధికారుల మధ్యవర్తిత్వం అక్కరలేదని వారి విశ్వాసం. ప్రతి వ్యక్తి తన మోక్షసాధనకు తానే కృషి చేయగలడని వారి నమ్మకం. రోమను కాథలికు మతాధిపతుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఇది ఉద్భవించింది. దీని వ్యాప్తి ఫలితంగా జాతీయవాదం పుంజుకున్నది. ఏ దేశానికి ఆ దేశంలో మత సంస్థలు పుట్టాయి. ఉదాహరణకు బ్రిటనులో ఇంగ్లీషు చర్చి ఉదయించింది.

ఒక విధంగా ఈ శాఖ సామాజిక జీవితానికి తోడ్పడింది. వారి చర్చిలు క్లబ్బులుగా అంటే సామాజిక సమావేశ ప్రదేశాలుగా తయారయ్యాయి; అంతే కాదు, అవి ధర్మసంస్థలుగా కూడ చలామణీ అవుతూ ఉన్నాయి. ఈ రెండు పరిణామాలు ముదావహమే. గ్రామంలోని బీద సాదలను ఆదుకోవటం, ఆ గ్రామస్థుల వివాహాది శుభకార్యాలకు, శవ ఖననంలాంటి అశుభకార్యాలకు తోడ్పడటం చేస్తున్నాయి ఆ చర్చిలు. దేశం యుద్ధంలో ఇరుక్కున్నపుడు యుద్ధ యత్నాలకు సాయపడటం కూడా జరుగుతున్నది; కాని ఇలా చేయటంవల్ల జాతీయ భావనను అధిగమించలేక పోతున్నది ఈ శాఖకు చెందిన చర్చి. ఏసు కరుణామయ జీవితాన్ని ప్రశంసించే ఈ రకపు క్రైస్తవులు పరాయిజాతి వారిపై పగను, క్రోధాన్ని పరోక్షంగానైనా ప్రోత్సహించడం శోచనీయం.

ఈ శాఖ కేథలికుశాఖకన్నా కొంత మెరుగుగా కన్పించినా వీరి సిద్ధాంతాలు కొన్ని మానవుని నిజాయితీకి, భావ స్పష్టతకూ వ్యతిరేకాలు. బైబిలులోని కథలన్నింటినీ వీరు ప్రతి అక్షరమూ నమ్మరు; సమర్థించరు కూడాను. అయితే వీరి ఆలోచనా పద్ధతి క్రొత్త పుంతలు త్రొక్కింది. అవి రెండు విధాలు. పునరాలోచనా ఒకటి; బైబిలు కథలను యథాతథంగాకాక సంకేత మాత్రంగానే స్వీకరించడం రెండవది. ఈ రెండు మార్గాలద్వారా బైబిలు యొక్క పవిత్రతను కాపాడాలని వీరి సంకల్పము.

ఉదాహరణకు బైబిలులోని రెండు కథలను తీసుకుందాము. ఏసు యొక్క స్వర్గారోహణ ఒకటి, తుది తీర్పు మరొకటి. ఏసు స్వర్గానికి వెళ్ళాడనే కథను ముమ్ముందుగా పరిగణిస్తే దానిని సంకేతంగానే గ్రహించాలని చెప్పటం జరిగింది. ఈ కథలాంటిది ఒకటి రోమను సీజరులలో ఒకడయిన అగస్టసుది. అతగాడు దహనాగ్నినుండి లేచి స్వర్గానికి వెళ్ళినట్లు కథనం. దానిని క్రైస్తవులు నమ్మరుకాని ఏసు క్రీస్తు కథ నమ్మకుండా ఉండలేరు. ఈ బాధ నుండి తప్పించుకోవడానికి ఏసు కథకు గూఢార్థం చెప్పడం సాగించారు ప్రొటెస్టెంట్లు. ఈ కథ మానవ జీవితానికి దేవుని జీవితానికి, ఉన్న సంబంధాన్ని తెలుపుతుందట. మానవ భవిష్యత్తును నిర్దేశిస్తుందట ఏసు జీవిత గాథ. ఇలాగని ఆ శాఖ బిషప్పులు చర్చిలలో మతబోధ సాగిస్తున్నారు. అయితే రెండు అంశాలు పై అభిప్రాయానికి భిన్నంగా ఉన్నాయి. ఒకటి బైబిలు కథ. "ఈ మాటలు చెప్పి వారు చూచుచుండగా ఆయన ఆరోహణమాయెను. అప్పుడు వారి కన్నులకు కనబడకుండ ఒక మేఘము ఆయనను కొనిపోయెను. ఆయన వెళ్ళుచుండగా వారు ఆకాశమువైపు తేరిచూచుచుండిరి. ఇదిగో తెల్లని వస్త్రములు ధరించుకొనిన యిద్దరు మనుష్యులు వారి యొద్ద నిలిచి : గలిలయ మనుష్యులారా, మీరెందుకు నిలిచి ఆకాశమువైపుకు చూచుచున్నారు? మీయొద్దనుండి పరలోకమునకు చేర్చుకొనబడిన యీ యేసే, ఏ రీతిగా పరలోకమునకు వెళ్ళుట మీరు చూచితిరో ఆ రీతిగానే ఆయన తిరిగి వచ్చునని వారితో చెప్పిరి." (అపొస్తలుల కార్యములు 1వ అధ్యాయం వాక్యాలు 9-11). ఇలా ఏసు స్వర్గారోహణ కథ వ్రాయబడింది బైబిలులో స్పష్టంగా. అంతేగాక కోట్లాది

క్రైస్తవులు దీనిని యదార్ధ గాథగానే విశ్వసిస్తున్నారు ఈనాటికీ. కనుక పరలోక ప్రయాణ కథకు గూఢార్ధం చెప్పపూనటం, తద్వారా దానిని సమర్ధించ ప్రయత్నించడం వ్యర్ధప్రయత్నం.

తుది తీర్పు కథకు కూడా ఇలాగే బాష్యం చెప్పడం జరిగింది. తన శిష్యుల కాలంలోనే తను తిరిగి వస్తానని ఏసు చెప్పినట్లు బైబిలు కథనం.

"ఇక్కడ నిలిచి యున్నవారిలో కొందరు, మనుష్య కుమారుడు తన రాజ్యముతో వచ్చుట చూచువరకు మరణము రుచి చూడరని నిశ్చయంగా మీతో చెప్పుచున్నాననెను" (మత్తయి సువార్త 16 వ అధ్యాయం 28వ వాక్యం)

"అప్పుడు మనుష్య కుమారుడు మహాప్రభావముతోను మహిమతోను మేఘారూఢుడై వచ్చుట చూచెదరు" (మత్తయి. అ॥ 13 వా 25)

"ఇవన్నియు జరుగువరకు ఈ తరము గతింపరని నిశ్చయంగా మీతో చెప్పుచున్నాను". (మత్తయి. అ॥ వా 30)

తన శిష్యులు వారి పవిత్ర కార్యనిర్వహణను పూర్తి చేసేలోగానే ప్రపంచము నశింపనగునని ఏసు చెప్పాడు.

"వారు ఈ పట్టణములో మిమ్మును హింసించునప్పుడు మరియొక పట్టణమునకు పారిపోవుడి; మనుష్య కుమారుడు వచ్చువరకు మీరు ఇశ్రాయేలు పట్టణములలో సంచారము చేసి యుండరని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను." (మత్తయి అ॥ 10 వా 23).

ఏసు మరల తిరిగిరాలేదు. అతని రాజ్యము ప్రతిష్ఠించబడలేదు. తుది తీర్పు జరగలేదు. క్రైస్తవులు ఇరకాటంలో పడ్డారు. ఈ కథకు లాక్షణికార్ధం చెప్పటానికి ప్రయత్నాలు సాగించారు.

ఏసు క్రీస్తు రాజ్యం వచ్చేకాలం చేరువలోనే ఉన్నదట; అంటే మానవుని వర్తమాన జీవిత పరిణామ ప్రక్రియకూ శాశ్వత జీవిత సత్యానికీ

ఉన్న సంబంధాన్ని వివరిస్తుందట ఆ కథ. ఈ ఆధ్యాత్మిక సత్యాన్ని సర్వదా గుర్తు చేస్తుందట ఈ గాథ.

ఇలా బైబిలులోని కట్టు కథలను నమ్మలేకా, వాటిని పూర్తిగా కాదన లేక, కొట్టుమిట్టాడు తున్నారు ప్రొటెస్టెంటుశాఖవారు వక్రభాష్యాలతో వివరి తార్ధాలతో. కాని పాపం వారిది వృధా ప్రయాస. ఇది ఆత్మవంచన; పైగా పరవంచన కూడాను.

ఇలా అసత్యాలను సత్యాలుగా ప్రచారం చేయపూనడం నీతివంత మైన కార్యం కాదు. మార్లో ప్రభువు చెప్పినట్లు "ఏ ఉద్దేశముతో నైనా సరే సత్యాన్ని మార్చపూనేవారు మానవాభ్యుదయ జీవశక్తితో చెలగాట మాడు తున్నారు". ఆధునిక క్రైస్తవం చేస్తున్నదల్లా సత్యంతో చెలగాట మాడటమే. ఇలా మానవుని నైతిక జీవితంలో ప్రొటెస్టెంటుశాఖ సంక్షోభం తెచ్చిపెట్టింది. అందుకే చిత్తశుద్ధికల క్రైస్తవులు ఎక్కువకాలం ఈ శాఖలో ఉండలేక విడివడి హేతువాదులవుతున్నారు. ఈ మార్పు అనివార్యం; అభిలషణీయం కూడాను.

# మతదృష్టిలో మహిళ

భార్య వుండగా రెండో పెళ్ళికి హక్కులేదని సెక్షన్ 5 (1) హిందూ వివాహ చట్టంలో రాయటం అవివేకంకాదా? ఇండియాలో ముస్లిములు నలుగురు భార్యలను, యూదులు ఇద్దరు భార్యలను పెండ్లాడే హక్కుగలిగి వున్నప్పుడు హిందువుకు మాత్రం ఒక్క భార్యే వుండాలని రాజ్యాంగంలో పొందుపరచటం హర్షించతగునా? ఈ హెచ్చుతగ్గులు రాజ్యాంగపు ఉపక్రమణికకే (Preamble) అవమానంకాదా? ఇలా తేడాలు చూపడం రాజ్యాంగములోని 14వ ఆర్టికల్‌ను ఉల్లంఘించడం కాదా? "భార్యవుండగా మళ్ళీ పెళ్ళాడేహక్కు నాకెందుకివ్వరు?" అని 14-9-82 న సుప్రీం కోర్టులో న్యాయమూర్తులు డి. ఎ. దేశాయ్, బహురుల్ ఇస్లామ్‌లను ప్రశ్నించాడొక హిందూ పిటీషనరు. అత్యున్నత న్యాయస్థానంలో ఇలా ఒక వ్యక్తి నిలబడి ప్రశ్నించటం స్త్రీ జాతికేకాదు మానవజాతికే అవమానకరం. విజ్ఞానయుతమైన 20వ శతాబ్దంలో ఈనాడు మనం జీవిస్తున్నాం. కాని రాతియుగపు వారసత్వాన్ని మనమింకా అధిగమించలేక పోవటం శోచనీయం. ప్రాచీన మనస్తత్వం, పురాతన సంప్రదాయం మనల్నింకా వెన్నుపోటు పొడుస్తూనే ఉన్నాయి. అసలు ఒక మతంలో లోపాలు, దోషాలు వుంటే వాటిని సవరించాలికాని, మరోమతంవారుకూడా వాటిని కొనసాగించాలనడం హాస్యాస్పదం, అవివేకం. అది వితండవాదం; మత మౌఢ్యం కూడాను.

"మానవాభ్యుదయానికి, మానవ శ్రేయస్సు కొరకు పుట్టింది మతం. మతంలేనిదే మానవ మనుగడలేదు మతవాది నీతివంతుడవుతాడు. మత విధ్వంసికి నీతి నియమాలుండవు. తల్లికి, చెల్లికి, భార్యకు తేడాలు చూపడు. పాపపుణ్యాలకు కట్టుపడడు. అంతేకాదు, మతద్వేషి పాషండుడు, అరాజకవాగి. మతం మహోన్నతమైనది, శాశ్వతమైనది. విశ్వ మానవాభ్యుదయాన్ని కాంక్షిస్తుంది. అలాంటి మతం స్త్రీలకు రక్షణ, ఆశ్రయం ఇస్తుందేకాని నాశనాన్ని కోరుతుందనటం మహాపాతకం" అంటూ చిందులు తొక్కుతారు సనాతన సంప్రదాయ వాదులు, ప్రవక్తలు.

మనదొక చిత్రాతి చిత్రమైన సంస్కృతి. ఎక్కడ స్త్రీ గౌరవింపబడదో అక్కడ సుఖశాంతులుండవనే చిలుకపలుకు ఉంది. అది చాలక

స్త్రీ జనాభ్యుదయమే సమాజానికి గీటురాయి అనడం కొంతమందిమతవాదులకు 'ఫాషన్'గా మారిందీనాడు. స్త్రీపురుషులిద్దరూ సహజీవనము చేయటం నిజమైన స్వేచ్ఛ అంటారు పైకి. కాని స్వేచ్ఛకు నూరామడల దూరంలో స్త్రీ వుండాలంటారు ఆచారం పేరుతో. ఏది సత్యం, ఏదసత్యమో తెలియని అయోమయమే మన మత సంస్కృతి.

ఏ దేశంలో, ఏమతంలో, ఏనాడూ స్త్రీ సమానహోదా-తాహతు అనుభవించినట్లు ఆధారాలు లేవు. వేదాలు చదివినా, నాటివ్యవస్థ చూచినా, స్త్రీకి ప్రత్యేక విశిష్టత వున్నట్లు కన్పించదు. అసలు వేద ప్రవచన చేసిన ఋషులలో స్త్రీలు ఒకరిద్దరు తప్ప లేనేలేరు. పైగా స్త్రీలు వేదం చదువరాదనే ఆంక్షలుకూడా వచ్చాయి తరువాత.

మతదృష్టిలో 'సమాజం' అంటే పురుషులేనని, వారి అవసరాన్ని తీర్చే యంత్రం మాత్రమే స్త్రీ అని తేల్చారు. పురుషుల అవసరాలనుబట్టి స్త్రీలు చేయాల్సిన పనులు వేరుగా కేటాయించారు ధర్మశాస్త్రజ్ఞులు. ఇష్టం లేకపోయినా, ఆమె 'ఇదేమిటి?' అని ప్రశ్నించరాదు. తన అయిష్టత బహిర్గతం చెయ్యరాదు. అలా అడిగినవారిని 'అది బరితెగించిందిరా' అంటూ కఠినంగా శిక్షించమంటుంది మతం. స్త్రీని శృంగార సాధనంగా, పిల్లల్నికనే యంత్రంగా, గొడ్డుచాకిరిచేసే బానిసగా తయారుచేశాయి మతాచారాలు. అసలు మత ఆవిర్భావంతోనే కర్మ అని, తలరాత అని, దైవ నిర్ణయమని ప్రవచనాలు వున్నాయి. స్త్రీకి ఆంక్షలు, కట్టుబాట్లు నిర్దేశింపబడ్డాయి. మతం స్త్రీ స్థానాన్ని పురుషుడి పాదాల చెంతనే వుంచింది. శైశవం దాటగానే మెల్లిగామాట్లాడాలని, తలెత్తుకొని తిరుగరాదని, నిటారుగా నిలబడరాదని శాసించింది. భర్త ఆజ్ఞలను శిరసావహించాలని, అత్త, మామలకు అణిగిమణిగి వుండాలని, స్త్రీకి ఇల్లే స్వర్గమని భర్తే పరమ దైవమని విధి నిషేధాలు మన పురాణాల్లో ధర్మశాస్త్రాల్లో దర్శనమిస్తాయి. స్త్రీ ఆజన్మాంతం ఎలా జీవించాలో కుమారీశతకం లాంటివి రాయించి వివరంగా బోధించారు మతస్థులు. హిందూమతం, ఇస్లాం, క్రైస్తవం ముఖ్యమైన మతాలు. మనుధర్మశాస్త్రం, కొరాన్, బైబిలు వాటి మత గ్రంధాలు. అవి స్త్రీని చాలా నీచాతినీచంగా చిత్రించాయి.

స్త్రీలు నరకానికి సింహద్వారంవంటి వారన్నాడు శంకరాచార్యుడు. ఆడది పాపగర్భంనుండి జన్మించిందంటుంది భగవద్గీత. ఆడదానికి

ఆజన్మాంతసంరక్షకత్వం ప్రతిపాదించింది మనుస్మృతి. స్త్రీని బానిసత్వానికి చిహ్నంగా ఆటబొమ్మగా మార్చేశాయి ధర్మశాస్త్రాలు. అంతేకాదు భర్త కూ్రుడైనా, కొట్టినా, చంపినా, భర్తే ప్రత్యక్ష దైవంలా పూజించాలని నిర్వచించింది హిందూమతం.

ఇస్లాం స్త్రీలను జంతువులతో పోల్చింది. స్త్రీని పొలంగా పేర్కొంటూ దానిపై సర్వాధికారాలు దున్నేవాడిదేనంటూ కొరాన్‌లో వ్రాసి వుంది. స్త్రీని పాపాలకు మూలకారణమైన "ఈవ్"గా ప్రతిపాదించింది క్రైస్తవం. 'నీకు విధేయత చూపుతాన'ని పెళ్ళినాటి ప్రమాణాల్లో సైతం స్త్రీచే ప్రమాణం చేయిస్తుంది. పురుషుని ముందు సృష్టించి, అతని సంతోషంకోసమే స్త్రీని దేవుడు సృష్టించాడని ప్రచారం చేస్తోంది బైబిలు. అసలు పురుష పతనానికి కారణంకూడా ఆడదేనని ఈసడిస్తుంది. మత సంస్కర్తల్లో ముఖ్యుడైన బుద్ధుడు సైతం భిక్షుణిలుగా ప్రవేశార్హత లేదన్నాడు. పెంపుడుతల్లి గౌతమి బుద్ధునితో సర్వసంగ పరిత్యాగం చేయ గలమని, తమకు మోక్షార్హత కావాలని వాదించిన తర్వాతే అవకాశమిచ్చాడు బౌద్ధ సన్యాసినులుగా. ఇలా అన్ని మతాలు స్త్రీని అణగద్రొక్కాయి. స్త్రీ అంటే పురుషుని భోగ్య వస్తువని, పిల్లల్నికని వంశాన్ని వృద్ధిచేయ టానికి ఆమె సృష్టింపబడ్డదని మత గ్రంథాలన్నీ ధృవీకరించాయి. అసలు మత ప్రవక్తలంతా పురుషులే. శాసన కర్తలు, ధర్మశాస్త్రకారులు సైతం పురుషులే కనుక వారి ఆధిపత్యాన్ని పెంచుకున్నారు; ప్రచారం చేశారు. అలా లొంగుబాటును చూపటమే పాతివ్రత్యమంటూ, భారతీయ సంస్కృతి అంటూ బ్రహ్మాండమైన బ్రెయిన్ వాష్ చేయబడినది.

పురుషుణ్ణే కేంద్రంగా వుంచి ఆరాధించాలి. ఆమె అతని ఆస్తిగా, వస్తువుగా చలామణి కావాలి. ఇలాంటి ఈ సమాజపు సంప్రదాయానికి, సంస్కృతికి విరుద్ధమైన ఆలోచన ఆమె చెయ్యలేదు. కనుకనే ఆధునిక భావాలు, శాస్త్రీయ దృక్పథం ఆమెలో మృగ్యమయ్యాయి.

స్త్రీ కూడా మనిషేనని, ఆమెకు స్వేచ్ఛా వ్యక్తిత్వం వుండాలని ఏనాడూ ఏ మతమూ బోధించలేదు. అందువల్లనే పురాణయుగంనాటి పాతివ్రత్యాన్ని, నోములు, వ్రతాలు, పూజలులాంటి మతపరమైన క్రతువు లను స్త్రీలింకా పాటిస్తున్నారు. పురుషాధిక్యతను తలదాలుస్తున్నారు చాలామంది స్త్రీలు. ఏదో ఒక మతంలో నమ్మిక కలిగుంటారు. వారి కాలమంతా ప్రార్థనలకు, బాబాల సూక్తులకు పురాణ శ్రవణాలకు వినియోగిస్తారు.

ఈ పరిస్థితికి కారణమేమిటి అని ప్రశ్నించమంటుంది హేతువాదం. ఎందుకు, ఏమిటి? అనే ఆలోచనకు అవకాశంవుంది హేతువాదంలో. సమాజాభివృద్ధికి కీలకమైన స్త్రీ స్థాయిని, స్థానాన్ని కాదనదు హేతువాదం. ప్రతి సంస్కరణా, అభివృద్ధీ, స్త్రీ జీవితంలో ముడిపడి వుండాలంటారు భౌతికవాదులు. స్త్రీకి సమాన గౌరవం, అవకాశం లేని స్థితిని జాతికి అవమానంగా భావిస్తాడు హేతువాది.

మతవాదుల విజృంభణ మహిళను బలిచేసింది; మతం తేలిగ్గా నశించదు. ఎంతకాలం స్త్రీ అజ్ఞానంలో వుంటుందో, దరిద్రంలో వుంటుందో, దాస్యంలో మ్రగ్గుతుందో అంతకాలం సంప్రదాయ శక్తుల బల ప్రదర్శనం ఆమెపై విజృంభిస్తూనే వుంటాయి.

కారణమేమయినాకాని మతం మహిళను రెండవ తరగతి మనిషిగా మార్చింది. బానిసగా ఆమెను సంకెళ్ళతో బిగించింది. ఇది జరిగిపోయిన విషయం. ఇప్పుడు జరగాల్సింది ఆ సంకెళ్ళనుండి ఆమెకు విముక్తి; తద్వారా సమాజ ప్రగతి.

మతానికి, మతగ్రంథాలకు, మత ప్రవక్తలకు విరుగుడు హేతువాదం; స్త్రీలలో ఆధునికత్వం కావాలి. అది అసాధ్యమేమీకాదు. మతస్తుల పురాణ పఠనం, శ్రవణం జరిగినంత ఉధృతంగా హేతువాద ప్రబోధం జరగాలి. హేతువాదంలో అసమానత్వంలేదు. కులమతాల బేధాలులేవు. స్త్రీ పురుషుల అసమానత్వంలేదు. హెచ్చుతగ్గులులేవు. ఆలోచనకు అవకాశంవుంది.

విజ్ఞానశాస్త్రం పెరిగినంతగా శాస్త్రీయ దృక్పథం మన జీవితాను భవంలోనికి రానికారణంవల్లనే మానవుడు భావదాస్యానికి కొరముట్టు అయిపొయ్యాడు. భావవాదానికి ముద్దుబిడ్డ మతం. 'మా మతం గొప్పదంటే మాది అద్వితీయమ'నే అహంభావం నిండి నిబిడీకృతమై వున్నది మతవాదుల మస్తిష్కాలలో. మతమౌఢ్యానికి సంకేతాలు తేడాలూ, హెచ్చుతగ్గులూను.

స్త్రీలు సామాజిక కార్యక్రమాల విషయికంగా ప్రేక్షకులు కారాదు. ప్రయోజనకరమైన కార్యాచరణకు పూనుకోవాలి. స్త్రీలుగానే కాకుండా, సమాజంలో చైతన్యం కల వ్యక్తులుగా రాజకీయాల్లో పాల్గొనాలి. బిడ్డలకు మెరుగైన ప్రపంచ జ్ఞానం ఇవ్వాలంటే ముందు స్త్రీలు విజ్ఞానవంతులు కాకతప్పదు.

# ఏసుక్రీస్తు వ్యక్తిత్వ పరిశీలన

క్రైస్తవులతో సంభాషిస్తున్నప్పుడు మానవవాదులు బైబిలులోని క్రొత్త నిబంధన నుండి కొన్ని వాక్యాలు చదివితే చాలామంది క్రైస్తవులు 'ఇవి బైబిలులో లేవని' వాదిస్తారు. కారణమేమంటే చాలామంది క్రైస్తవులు క్రొత్త నిబంధనను పూర్తిగా చదివివుండరు. కొన్ని కొన్ని భాగాలు మాత్రమె చదివి వుంటారు.

నిజానికి సువార్తలు ఏసుక్రీస్తు చర్యలు గురించి అవి జరిగిన 20, 30 ఏళ్ళ తర్వాత రాయడం జరిగింది. అదయినా వినికిడివల్ల పుట్టిన గాథల వ్రాతలే. క్రీస్తు చెప్పాడని రాసివున్నా అవి అతని మాటలని మనం అనుకోడానికి వీలులేదు. మొత్తం మీద చూస్తే ఆ సువార్తలు ఆయున వ్యక్తిత్వాన్ని గురించి, ఆయున బోధల్ని గురించి సరియైన అంచనానే చదువరులకు అందజేస్తాయి. సునిశతంగా పరిశీలిస్తే క్రీస్తు శాంతమూర్తి కాడని, అతని యొక్క శీలము సంక్లిష్టమని తేలుతుంది. కొన్ని సమయాలలో శాంతమూర్తిగాను, ప్రేమమూర్తిగాను కనపడతాడు. మరికొన్ని సందర్భాలలో అసహనం, కక్ష, కాఠిన్యం అతనిలో గోచరిస్తాయి.

సువార్తలను పూర్తిగా చదవవలసిన బాధ్యతవున్న మత గురువులకు ఏసుక్రీస్తు వ్యక్తిత్వంలోని దుష్ట భాగాలు తెలిసినప్పుడు వారు సంకట స్థితిలో ఇరుక్కుంటారు. బైట పడడానికి వారు మూడు విధానాలను అవలంబిస్తారు. ఇబ్బందికరంగా కనపడే విభాగాలను నిర్లక్ష్యం చేయడం మొదటి విధానం. వాటిని సంకేతాలుగా మాత్రమే గ్రహించడం రెండో పద్ధతి. అలాకాకుండా వాటిని ప్రక్షిప్తాలుగానో, లేక భాషాంతరీకరణలో దొర్లిన తప్పులుగానో ఎంచడం మూడో పద్ధతి. ఉ॥ తల్లి దండ్రులను, కుటుంబ సభ్యులను ద్వేషించ వలసినదిగా చేయబడిన ఏసుబోధను పట్టించుకోరు మతగురువులు. పాపులు, అవిశ్వాసులు భయానకమైన నరక యాతన అనుభవిస్తారని క్రీస్తు చేసిన ప్రసంగాలను ప్రొటెస్టెంట్లు సంకేత పరంగానే (సింబాలిక్‌గా) స్వీకరిస్తారు. ఇది రెండో పద్ధతికి నిదర్శనం. ఏసుక్రీస్తును శిష్యులు ఒకసారి సామెతల్లో, కథల్లో ఎందుకు ప్రసంగిస్తావని అడిగినట్లున్నా, విశ్వాసులకు అర్థం కావటానికి అలా మాట్లాడుతున్నాడని

ఆయన చెప్పినట్లున్నా అంతేకాక అవిశ్వాసులు తన బోధను అవగాహన చేసుకుంటే వారిపాపాలు క్షమించబడతాయి కనుక వారికి అర్థంకాకుండా మాట్లాడుతున్నానని ఏసు సమాధానం చెప్పాడని మూడు సువార్తల్లో వున్నది. దీనిని ప్రక్షిప్తంగా భావిస్తున్నారు.

ఈ పైన పేర్కొనబడిన మూడు విధానాలను అవలంభించినంత మాత్రాన ఏసుక్రీస్తు యొక్క వ్యక్తిత్వాన్ని మహోన్నతం చేయలేరు. ఒక్కొక్కప్పుడు ఆయన ఉత్తేజకర ప్రసంగాలు చేశాడు; మరికొన్ని సందర్భాలలో ఆయన దారుణంగా మాట్లాడాడు. తమ కనుకూలమైన కథలను, గాథలను మాత్రమే స్వీకరించి ఏసును గొప్పవానిగా చిత్రీకరిస్తే ఆయనలోని దుష్ట లక్షణాలను వెలికితీసే కథలను ఎన్నుకొని విమర్శకులు ఆయన్ను దుర్మార్గునిగా చిత్రించవచ్చు. అంతేకాక ఏసుక్రీస్తు దేవుని కుమారుడని, ఆయన మరణించిన తర్వాత లేచి తిరుగాడాడని, శరీరం నశించిన తర్వాత కూడా మానవులు జీవించగలరని చెప్పే అంశాలను విశ్వసించడం కష్టం. ఏసుక్రీస్తు యొక్క సంప్రదాయ వ్యక్తిత్వానికి, సువార్తలలోని ఏసుక్రీస్తు వ్యక్తిత్వానికి తేడావుంది. కరుణాన్వితమైన ప్రేమ, వినయము ఆయన బోధించాడు. కాని ఆయన ఆచరణ ఆయన బోధల కనుగుణంగా లేదు. తన శిష్యులయెడ, తనను నమ్మినవారియెడల ప్రేమగా ఆప్యాయంగా వుండేవాడు. అవిశ్వాసులను విమర్శకులను తీవ్రపదజాలంతో నిరసించి వారిని శాపనార్థాలు పెట్టేవాడు. తన స్వరాష్ట్రమైన గెలీలిలోని గ్రామస్తులను విపరీతంగా తిట్టిపోశాడు; తనని రక్షకుడుగా అంగీకరించని పరిసయ్యులను విషసర్పాలుగా చిత్రించి వారికి నరకం తప్పదని నిందించాడు.

ఏసుక్రీస్తులో అంధవిశ్వాసం జాస్తి. ఆదర్శవాదిగా వుండే తత్వం అతనిలో చోటు చేసుకుంది. విశ్వజనీన ప్రేమయొక్క అవసరాన్ని గురించి అశ్రువులు రాలుస్తూ ప్రబోధం చేస్తాడు. మరుక్షణంలో తన విమర్శకులను కపటులని, అంధ విశ్వాసులని, దగుల్బాజీలని నిందిస్తాడు. ఇలా ప్రవర్తించడం మానవ సహజమే. కాని ఇది మానవాతీత ప్రవర్తన కానేకాదు, సోక్రటీస్ లాంటి చారిత్రాత్మక మహాపురుషులు విమర్శను పొందాగా,

గౌరవంగా, సభ్యతతో తట్టుకున్నారు. ఇంతకూ తేలిందేమంటే ఏసుక్రీస్తు యొక్క శీలంలో అందరిలాగానే మంచి చెడ్డలు మిశితమై వున్నాయని, ఆయన దేవుని కుమారుడు కాడని. ఈ ముఖ్యాంశాన్ని గుర్తుపెట్టుకుంటే ఆయన బోధనలోని మంచి చెడ్డలను హేతు పద్ధతిలో తార్కిక విధానాన్ని అవలంభించి మదింపు చేయగలం.

"సింహాసనముల నుండి బలవంతులను పడద్రోసి దీనులనెక్కించెను. ఆకలిగొనిన వారిని మంచి పదార్థములతో సంతృప్తి పరచి ధనవంతులను వట్టి చేతులతో పంపి వేసెను." (లూకా అ. 1, వాక్యం 52-53) దీనిని బట్టి అణచివేయబడిన వారికి ధనవంతులమీద, అదృష్టవంతులమీదవుండే కోపము ఏసుకు కూడా వున్నదని రుజువవు తున్నది.

ఏసు వ్యక్తిత్వాన్ని పరిశీలించినపుడు సామాన్య మానవులకు వుండే రాగద్వేషాలు, ఈర్ష్యాసూయలు ఏసులో అంతర్లీనంగా ఉన్నాయనేదానికి దాఖలాలు కోకొల్లలుగా దొరుకుతాయి. ఏసును మానవ మాత్రుడుగానే యూదులు భావించారు; ఒక రక్షకుడుగా వచ్చి దాస్య విముక్తి చేశాడని యూదులు నమ్మినట్లు హేతువాదులు అంగీకరించరు. ఆ రక్షకుడు మనుష్య రూపంలో వచ్చాడని అసలే విశ్వసించరు. ఇరవయ్యో శతాబ్దంలో కూడ ఏసును దైవాంశ సంభూతునిగా వర్ణించటం హాస్యాస్పదం.

— o —

# మనువు : మన సంస్కృతి

అవి దురాచారాలైనా, కాలగతినిబట్టి అర్థరహితాలైనా, ఆచరించ టానికి అనర్థదాయకాలైనా, పనికి మాలినవై మన ప్రాణాన్ని తోడేవి అయినా మనం వాటిని ఒక పక్షాన విడిచిపెట్టం. అదిమన ప్రత్యేక లక్షణం; అది మన లక్ష్యంకూడాను. మన మనస్తత్వంలో జీర్ణించిన కర్మసిద్ధాంతం, పిరికితనం, జడత్వం, మూఢవిశ్వాసం, సనాతన సంప్రదాయం మనల్ని వెలుగు చూడనివ్వవు; ముందుకు సాగ నివ్వవు. మనం చాలా మేధావుల మని, పవిత్రులమని పొగిడేసుకోవటం మన జాతిలక్షణం; ఆటవిక జాతీయ వారసత్వం కూడా.

"ఇది మన పవిత్ర భా ర త భూ మి. మన సంస్కృతి చాలా విశిష్ట మైనది. మతాలలోకెల్లా అద్వితీయమైనది హిందూమతం. ఈ మతంలో పుట్టటమే పురాకృతసుకృతం. అందులో గృహిణిగా పుట్టటం ఎన్నో నోముల పంట. బిడ్డల్ని కనేది, పెంచేది, వంశాభివృద్ధి చేసేది స్త్రీలే. అసలు వారు సృష్టింపబడేది అందుకే"అని ఇలా రోజూ మనంతవాళ్ళు లేవనుకోవడం మన వ్యాధిలక్షణం. ఈ దీర్ఘవ్యాధికి అభివృద్ధి వుందికాని నశింపులేదు. దీనికి ఔషధం లభించడం దుర్లభం. ఇలా కరుడుగట్టిన ఈ రుగ్మతకు కారణా లేమిటి? కారకులెవరు! ఈ దృక్పథం ఎలాపుట్టింది? ఎందుకు పుట్టింది?

ఈ జాడ్యానికి మూలకారణం మతం. మతమనే బకాసురుడు మానవ త్వాన్ని మింగేసి మనల్ని జీవచ్ఛవాల్లా చేసి, నలిపి, మ్రింగిపారేస్తున్నాడు. ఆ మతానికి స్త్రీ పేరు వింటేనే ఉ న్మా ద ం పెరిగి, అది భూనకరూపం దాలుస్తుంది. ఒళ్ళు తెలియని ఆవేశం, క్రోధం, ఈర్ష్యా ఇట్టే వస్తాయి. అన్నీ పెనగొన్న ఆ మతం ఆమె మీదపడి ఆమె వ్యక్తిత్వాన్ని ధ్వంసం చేసి, ఆమెను చిత్రహింసలపాలు చేస్తుంది.

మతం తన ఇంద్రజాలంతో మాయాగాలం వేసి ముందుగా పురుషుణ్ణి చేజిక్కించుకుంది. నీతిబోధలంటూ, ధర్మశాస్త్రాలంటూ పారలౌకికమనే పేరుతో పురుషుణ్ణి తన బానిసను చేసుకుంది. దానికప్పుడు స్త్రీని నమిలి

మింగేయడం తేలికవని అయింది. అది మంచి మాటలతో మానవుణ్ణి సమీపించి 'ఓమనిషీ! నీవు పురుషుడివి; నిన్ను వున్నతుని చేస్తా; నామాటలు వింటావా? నీకు ఉన్నత స్థానాన్ని ఇస్తా. అయితే నీ భవిష్యత్తుకు కర్తను నేను కావాలి! తెలిసిందా? అంగీకరిస్తావా?' అంటూ ఎరవేసింది మతం. ఓ యబ్బో! అంటూ దాని కౌగిట్లోపడి నీ అజ్ఞను శిరసావహిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ఇక ఆ కొండశలువ అతన్ని ఆపాదమస్తకం బిగించింది. ఊపిరి పీల్చుకోటానికి, ఆలోచించుకోవటానికి అవకాశంలేనిరీతిలో, తదాదిసంఘాన్ని మతాన్ని, సంప్రదాయాన్ని గురించితప్ప మానవత్వాన్ని గురించి ఆలోచించలేని జడమైపోయాడు మానవుడు.

అప్పుడామతం పడగ విప్పింది; నీతులు చెప్పింది; శాస్త్రాలు వల్లె వేసింది. అతనికి యజమాని పదవి యిచ్చి పట్టం కట్టింది. ముందుగా 'నీ భార్య నీకు పాదదాసి కావాలి; ఆ పైన నీవు నాకు దాస్యం చెయ్యా' లన్నది. 'సరే' నన్నాడు ఆ మత్తులో; దాని చేతిలో కీలుబొమ్మ అయ్యాడు తెలియని అవివేకంతో. ఇది ప్రాచీన మానవుని మత గమ్మత్తుకథ. మత విజృంభణలో జరిగిన మొదటి ద్రోహం స్త్రీ పురుష భేదాలు. అందుకే "ఈ దేశంలో ఆడవాళ్ళులేరు; మగాళ్ళూ, వాళ్ళ ప్రాణంలేని నీడలూ మాత్రమే వున్నారు" అన్నాడు చలం.

స్త్రీ కేవలం పురుషుడి భోగాలకే సృష్టించబడ్డది. అతనినొత్తు. అతనికి లోబడి వుండాలనే భావాలను "పడతికి ఇహపరసాధన మా పతియే తల్లీ" అంటూ ఉగ్గుపాలతో రంగరించి పోసింది మతం. ఈ పొరపాటు భావాలను వ్యతిరేకిస్తుంది భౌతికవాదం. భార్య భర్తతాలూకు ఆస్తికాదు, ఆమె ఒక వ్యక్తి. ఆమెకూ కోరికలు ఉంటాయి అంటూ స్త్రీ పురుషులకు సమానత్వాన్ని ప్రతిపాదిస్తుంది హేతువాదం. అన్యోన్యంగా వుంటూ ఆదర్శ జీవితాన్ని గడపమని ఆధునికులు వాదిస్తుంటే, భర్త ఆజ్ఞలను శిరస్సునదాలుస్తూ కీర్తి ప్రతిష్ఠలు గడించమంటూ బోధిస్తుంది మతం.

"పతి బిల్వబంచిన వనియేమి యనివచ్చి
చెప్పిన యూడిగంబు సేయవలయు

భర్త యానతిలేక ప్రకృతి బంధునికైన
నే పదార్థంబు నీగిసెట్ట
జీవితేశ్వరు ఘడించిన యోగిరంబున
గుత్ప సేయక భుక్తి గొనగ దగవు
సుఖ నుప్తుడగునిజేశుని ప్రబోధయొనర్పన్గా
దనుష్టాన భంగములదప్ప" (కాశీఖండం)

"స్త్రీ జీవితాంతం భర్తకు విధేయురాలై లొంగి వుండాలి. తన వాక్పటిమను, వాక్ చాతుర్యతను భర్తముందు ప్రదర్శించరాదు. భర్త కోపిస్తే శిరసావహించాలి; కాని అలుక తెచ్చుకోరాదు. మాటకు ఎదురువల్కరాదు. భర్త దుఃఖిస్తే దుఃఖించాలి. సంతోషిస్తే సంతోషంగా వుండాలి". భార్య మనస్సులో దుఃఖిస్తున్నా బైటికిసంతోషంతో నవ్వుతూ, భర్తను పొగడుతూ ఏకాంతసేవ చెయ్యాలి"అని ఇలాంటి సూక్తులను కంఠాపాఠం చేయిస్తుంది మతం. దేవతల మహత్యాలని, స్థల పురాణాలని, సీతా సావిత్రిల కథలను, అశాస్త్రీయ విషయాలనేకం సంస్కృతి పేరుతో ప్రచారం చేస్తారు మతస్తులు.

మత దృష్టిలో నాడు, నేడు, ఏనాడు మార్పు కోరనిది ఒక్కటే - అది మహిళా సంస్కృతి. ఒక స్త్రీ సాంఘిక, ఆర్థిక, నైతిక రంగాలలో, అణగి మణగి వుండటానికి ఎన్ని కట్టుబాట్లు కావాలో అన్నింటికి సిద్ధాంత రూపాలు ఉన్నాయి మన సంస్కృతిలో. "పతినిబాసి వితంతువైనట్టి స్త్రీ యొక్క అశుచిత్వము సహస్ర ఘటంబుల అవభృతాభిషేక మాచరించినను తీరదు" అంటే భర్త శవంతో తాను సహగమనం చెయ్యాలి, లేదా ముదికి చావు చావాలి. ఆమెపై పెట్టిన ఆంక్షలు వర్ణనాతీతం. ఆ బాధలకన్నా సజీవ దహనమే ఉత్తమమని అంటున్నారు భర్తృ విహీనులు కొందరు.

పతివ్రతలకు పుట్టినిల్లు అయిన ఈ దేశంలో ఎన్నో మతాలు పుట్టాయి. ఎందరో మత ప్రవక్తలు ఉద్భవించారు. మరెన్నో మత సంస్కరణోద్యమాలు వెల్లివిరిశాయి. కాని స్త్రీలపట్ల దోపిడి, వివక్షత, లొంగుబాటు లాంటి ముఖ్య విషయాలలో ఏ మతమూ చొరవతీసుకోనూలేదు; ప్రతిఘటించనూ

లేదు; సంస్కరించనూలేదు. స్త్రీని పురుషుని భోగ సంతృప్తికి ఏర్పడ్డ సాధనంగా మాత్రమే చూడగలరు మతస్తులు, విశ్వాసులుకూడా. సంఘంలో, కుటుంబంలో, నైతిక విధానంలో అంతర్గతంగా, బహిర్గతంగా కూడా స్త్రీ పురుష సమానత్వాన్ని మతాలన్నీ వ్యతిరేకించినవే. దేవునిముందు "అందరూ సమానులే" అనేది మతసూక్తి. కాని ఏ చర్చిలోకాని, మసీదులో కాని, గుడిలోకాని అర్చన, పూజ వగైరాలకు పూజారిణిగా, లేక మత గురువుగా స్త్రీని నియమించారా? లేదు. ఎందుకు? ఆమె కేవలం సేవచేయు టానికే సృష్టించబడిందనేదే వారి భావం, అందుకే చర్చిలో 'బోధ'కు, మసీదులో "అల్లా"ను కొలవటానికి, గుడిలో అర్చనకు 'స్త్రీ నిషిద్ధ వస్తువు' వారి దృష్టిలో.

మత సంస్కృతి స్త్రీలను దేవతలుగానో, బానిసలుగానో తప్ప వ్యక్తులుగా చూడలేదు. అయితే ఇక్కడొక విడ్డూరంవుంది. దేవతలుగా ఆరాధిస్తామంటూనే బానిసగా చూడటం పరిపాటి అయింది. సంస్కృతి, సంప్రదాయం, కట్టుబాట్లలో స్త్రీఅపట్ల ద్వంద్వనీతి విలయతాండవం చేస్తుంది. మతస్తులు తమ అభిప్రాయాలకు అనుగుణంగా ప్రవర్తించే నిర్ణయాలు స్త్రీలు తమకు తాముగా తీసుకొనే విధంగా ఆమె మనస్సును చిన్ననాటి నుండి ఒక 'కండీషన్'లో నియమించారు. అందువల్లే ఆధునిక విద్య నేర్చిన యువతులు సైతం పాత సంప్రదాయానికి వ్యతిరేకమైన ఆలోచనకాని, పనికాని చెయ్యటానికి సాహసించరు. అదేదో పెద్ద విప్లవం గాను, తిరుగుబాటుగానూ భావిస్తారు. మహాపాపంగా, మరుజన్మలో క్రిమి కీటకాదులై పుడతామని వారు భయపడతారు.

మతశక్తుల విజృంభణకు బలి అయింది మన సమాజం. అందులో మతానికి, సమాజానికి, పురుషాధిపత్యానికికూడా లోకువయి ఆజన్మాంతం రెండో బెంచీకి నెట్టబడ్డది మన మహిళ.

అసలు మతదృష్టిలో సమాజం అంటే కేవలం పురుషుడేనని, అతని సేవకు, సుఖ సంతోషాలకొరకే స్త్రీ సృష్టింపబడిందనే విశ్వాసం వుంది. ఆ తత్వమే మన పెద్దవాళ్ళందరి మస్తిష్కాలలో చోటుచేసుకుంది. అందుకే

ఆడది ఆధారపడి జీవించే ప్రాణి (పేరాసైట్) గా చూడబడుతుంది. వివాహం, మాతృత్వాలవల్ల ఆమెస్థితి దయనీయమయింది. ఆర్థికాధిపత్యం తగ్గి అణగారి పోయింది. నేటి స్త్రీకి రాజకీయ భాగస్వామ్యాన్ని రాజ్యాంగం ప్రసాదించినా ఆర్థిక అసమానత్వంవల్ల, సాంఘిక అసమానత్వంవల్ల ఆమె రాజకీయాలకు దూరంగా నెట్టబడింది. ఇలా మన మనోభావాల్లో జీర్ణించిన అసమానత్వం, స్త్రీల యెడల వివక్షతా, పురుషాధిపత్యం మనల్ని ఆధునిక వాతావరణంలోకి పోనివ్వటం లేదు. మనలోని అశాస్త్రీయ దృక్పథం మనను ముందుకు సాగనివ్వటంలేదు.

సంపాదించే ఉద్యోగినులుగాని, సొంత ఆస్తి కలిగివున్న గృహిణులు గాని స్వేచ్ఛ కలిగిలేరు. వారిముఖాలలో సంతోషం కనిపించదు. కారణం ఆమె సంపాదనపై, ఆమె ఆస్తిపై భర్తకో, తండ్రికో ఏ అన్నదమ్ములకో హక్కువుంటుంది. ఈ సాంఘిక నిమ్నోన్నతాలు మనకు తెలియనివికావు. ఇలా స్త్రీల సాంస్కృతిక జీవితాలు వివాదాంకితాలవు తున్నాయి. ఆడది మొగుణ్ణి డబ్బుపెట్టి కొనుక్కోవలసిన స్థితిలోవుందంటే ఎంత అనాగరికులమో! వివాహం జరిగేది కన్యల మనస్సుకూ, మమతకూకాదు; కట్నాలకు, కులాలకు, వంశానికి, అంతస్తుకూ మాత్రమేనని రూఢిగా చెప్పవచ్చు. వేద కాలంనుండి మనువు వరకు, బ్రిటీష్ వారి నుండి నేటివరకు ఏనాడూ, ఏ మతమూ, ఏశట్టాలూ, ఏ ధర్మశాస్త్రాలూ స్త్రీని వ్యక్తిగా పరిగణించనేలేదు ప్రాచీన భారతీయ సంస్కృతిలో మానవత్వానికి విలువ యివ్వబడినా చాలా భాగం మతం, దైవం, భయం, భక్తి, సేవ విషయాలకే ప్రాముఖ్యత నిచ్చారు. పారలౌకికం అంటే పతిభక్తి అని స్పష్టీకరించింది మన సంప్రదాయం. అందుకే భర్తను 'ప్రత్యక్ష దైవం'గా ఆరాధిస్తారు. పూజిస్తారు. తాము మాత్రం తన్నులు తింటారు.

మనిషి పుట్టుకతోనే స్వేచ్ఛ పుడుతుంది. స్వేచ్ఛగా బ్రతకటానికి ప్రతి వ్యక్తికీ హక్కువుంది. కాని స్త్రీ స్వేచ్ఛను మతం పేరుతో, గౌరవం పేరుతో, కుటుంబ సంక్షేమం పేరుతో, సామాజిక మర్యాదకోసం వమ్ముచేస్తున్నారు. అదికూడా ఆమె ఇష్టపూర్వకంగా, సంతోషంగా, సహజంగా వొదులు కోవాలి. ఆఖరికి ఆమె ఆత్మహత్యకు పాల్పడుతూ

ప్రాణత్యాగం తప్ప గత్యంతరం లేని సమయంలో కూడా, భర్త 'శాడిజా'న్నుండి విముక్తికోసం చస్తూకూడా తన ఆత్మహత్యకు తానే కారణమని నిరూపిస్తుంది. భర్త తనని హత్యచేస్తే కూడా తానే ఆత్మహత్యకు పాల్పడ్డానని మరణ వాఙ్మూలంలో చెప్పిన కేసులెన్నో వున్నాయి.

వ్యాపార ప్రకటనలలో, సినిమా పోష్టర్లలో, స్త్రీ నగ్న చిత్రాలు, బూతు సాహిత్యం ప్రచురించటంలో ఏ పురుషుడూ వ్యతిరేకించడు; ఏమతమూ ఘోషించదు. అప్పుడామె పవిత్రత, సంస్కృతి ఏమౌతాయో? మతానికి రెండు నాల్కలు, ద్వంద్వ నీతి వున్నాయి. అన్నిటినీ తనలాభం కోసం, పరపతికోసం, తన సౌకర్యంకోసం మలుచుకుంటుంది.

'అసలు ఆడదంటే ఇలా బట్టకట్టుకోవాలి. అలా బొట్టుపెట్టుకోవాలి, తలుపు చాటునుండి తలవంచి సమాధానం చెప్పాలి. ఆమె అబల, అజ్ఞాని, అణగిమణగి వుండాలి.' అనే సిద్ధాంతాలు కోలెడన్ని వున్నాయి. అలాగే వారిపనులుకూడా అనేక హద్దులకు, పరిమితులకులోనై వేరుగా వుంటాయి. ఒకవేళ ఏ ఆడదయినా అద్భుతమైన పనులుచేస్తే వారికి 'అతీత శక్తులు' వ్నాయని హడలిపోతారు. మరి స్త్రీలలో కూడా పురుషుని మించిన ధైర్య సాహసాలున్న వారు లేరా?

వాలంటీనా తెరిస్కోవా రోదసీ విహారం చేసి గ్రహాంతర యానానికి స్త్రీలు వెనుకంజ వేయరని నిరూపించలేదా? జపాన్ మహిళల బృందం ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించి ప్రపంచంలోకెల్లా ఎత్తైన శిఖరంపై స్త్రీశక్తి పతాకాన్ని ఎగురవేసి మహాద్భుతాన్ని సృష్టించలేదా? రసాయనిక శాస్త్రంలో పరిశోధనలుచేసి రేడియంను కనుగొన్న మేడంక్యూరి రెండుసార్లు నోబులు ప్రయిజులు సంపాదించలేదా? క్రుపస్కయా సామర్థ్యంవల్లనే కదా లెనిన్ సోషలిస్టు విప్లవజ్యోతిఅయి వెలుగొందింది. ఎలియనార్ రూజువెల్టు, హెలెన్ కెల్లర్, థెరిసా, దుర్గాబాయి లాంటి మరెందరో వున్నతోన్నతులు స్త్రీలలో పుట్టలేదా! తగిన అవకాశం, శిక్షణా వుంటే స్త్రీలు ఏరంగంలోనూ పురుషులకు తీసిపోరని రుజువయిందికదా!

స్త్రీని పుట్టు బానిసను చేసింది మతం. ఆమె వ్యక్తిత్వాన్ని కుంచించింది సమాజం. ఆమె శక్తుల్ని అణచి పెట్టాడు పురుషుడు. దానివల్ల నష్టపోయేది స్త్రీలేననే భ్రమలోవున్నారేకాని మొత్తం మానవాళికే అనర్థకం అని మనం గ్రహించక పోవటం మన అవివేకమేకాదు; మత ప్రభావం కూడా.

ఏది ఏమయినా మనం ఆశాజీవులం. జడత్వం నుండే చైతన్యంకల జీవి ఉద్భవించింది; జడత్వానికి ప్రతీకలయిన కొండల్లోనే చైతన్యవంత మైన నదులుద్భవించాయి. ఈ ప్రకృతి నైజాన్నే స్త్రీ జీవితానికి అన్వయిద్దాం.

వెనుకటికి నీగ్రోలు తమబానిసత్వాన్ని పెయింటింగ్స్‌లో చూపారట. అలాగే నేటి స్త్రీలు తమ కష్టాలను, సమస్యలను సంజ్ఞలద్వారా, కంటిచూపుల ద్వారా చెప్పాలని ఆక్రోశిస్తున్నారు. వారిలో తప్పటడుగులతో ముందు కొస్తున్నారు బహుకొద్దిమంది. అయినా ఈ మత ఊబిలో దిగబడ్డ మహిళ లను ఎలా రక్షించాలి?

చట్టాలద్వారా, ఆర్డినెన్సులద్వారా స్త్రీలలో మార్పుతెచ్చుటదురూహ్యం. చట్టాలకు కన్నాలుపోతయ్యా అన్నట్లు, చట్టం అనేది కేవలం ఒక పనిముట్టు; అది కొంత రక్షణనస్తుంది. మరికొంత భయాన్ని కలిగిస్తుంది. కాని మనలో మానసిక దాస్య విముక్తి రానంతకాలం, మనలో ఆత్మవిశ్వాసం లేనంత కాలం, మనలో శాస్త్రీయ దృక్పథం పుంజుకోనంతకాలం, మనం మూఢ విశ్వాసాలు - దైవభీతి విస్మరించనంతకాలం మనల్ని వుద్ధరించేవాడుండరు. అజ్ఞానాన్నుండి విజ్ఞానవంతులం కావాలంటే హేతుత్వ దృక్పథం మనలో రావాలి; దానికై నిరంతర పోరాటం సలపాలి.

—

# హేతువాదం : ఎందుకు ? ఎవరికి ?

ప్రకృతిని శాస్త్రీయ దృక్పథంతో అర్థంచేసుకోలేని ప్రాచీన మానవ మస్తిష్కంలో పుట్టింది మతం. దైవ భావానికి ఆనాటి మానవ అజ్ఞానమే ప్రధాన కారణం. అలా పుట్టిన మతాలు మానవజాతి పురోగమనానికి, విజ్ఞాన పరిశోధనకు గొడ్డలి పెట్టులా నిలిచాయి. మూఢనమ్మకాలకు నాందివలికాయి. స్వర్గం - నరకం, అద్భుత శక్తులు, శకునాలు, జ్యోతిష్కాలు, కులవ్యవస్థ, మత దురభిమానం లాంటి అనాగరిక విశ్వాసాలకు ఆలవాలమయ్యాయి. మనిషికీ మనిషికీ తేడా, స్త్రీకి పురుషుడికీ తేడా, వర్ణాలు, కులాలు, జాతులు ఇలాఎన్నో మరెన్నో దురబిమానాలు పుట్టించాయి మతాలు. ప్రతిదీనమ్మాలి మతస్తుడు. సొంత ఆలోచన, వివేకం, విజ్ఞానం, శాస్త్రీయ దృక్పథం లాంటి భావాలకు మతంలో స్థానంలేదు. వ్యక్తి పుట్టుకనుండి మరణందాకా అతని విధులు నిర్దేశించి వుంటాయి. అది చాలక పరలోక సుఖం కోసం, పితృ దేవతల తృప్తికోసం క్రతువులన్నీ నెరవేర్చాలి. చేయనివాడు పాపి, పాషండుడు అంటూ వెలివేయడం నేటికీ జరుగుతుంది. విజ్ఞానం విశ్వ వీధుల్లో విహరిస్తున్న ఈనాడు సైతం రాతియుగపు వారసత్వంలో జీవించ మంటుంది సంప్రదాయవాదం. వ్యక్తి కోరేది ఆనందం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు. అవి వచ్చుకైనాగోచరించవు భావవాదంలో. ఆజన్మాంతం పూజలు, మొక్కుబడులు, ప్రార్థనలతో, పరలోకం కొరకు బ్రతకాలంటుంది ఆధ్యాత్మికవాదం. "పాపభీతి, భయంలేనివాడు నీతి పరుడుకాడు" అంటాయి ధర్మశాస్త్రాలు. మతస్తుల పాపపుణ్యాలు ద్వంద్వ నీతిలో వుంటాయి. కనుక హేతువాదుల మాట,బాట,ధ్యేయము, ఉనికి, జీవితవిధానం ముమ్ముందుగా పరిశీలిస్తే అది ఎందుకో, ఎవరికో తర్వాత తెలిసికొందాం.

హేతువాదం శాస్త్రీయ జ్ఞానంపై ఆధారపడి వుంటుంది. ఈ జగత్తు సత్యం అంటూ దాన్ని గురించిన జ్ఞానాన్ని సమీకరిస్తుంది. ఆ జ్ఞానాన్ని వ్యక్తి జీవితాన్ని సరిదిద్దు కోవటానికి వాడుకోమంటుంది. మానవ ఊహ ప్రయోగం ద్వారా ముందుగా రుజువు కావాలి. అంటే తర్కానికి అనుభ వానికి నిలిచేదాన్ని మాత్రమే నమ్మమంటుంది. హేతుత్వ శక్తి

కార్యకారణసంబంధాలను గుర్తించగలశక్తి మానవ మేదస్సులో వుంటుంది. ప్రకృతిలో వున్న ఈ కార్యకారణ నియమమే మానవునిలో హేతుత్వంగా ప్రతిఫలిస్తోంది. వస్తుతః మానవుడు వివేచనాపరుడు కనుకనే ఎప్పుడూ ఆలోచిస్తూ వుంటాడు. ఈ మానవ హేతుత్వ శక్తిని ఏ దివ్యశక్తి అనో, దైవమనో మనం రూపకల్పన చేసుకోవటం మన అజ్ఞానానికి నిదర్శనం. అందువల్లే "దేవుణ్ణి నమ్మవా?" అని ప్రశ్నిస్తే "దేవుడంటే ఎవరూ? ఉన్నట్లు నీవు రుజువుచేస్తే నమ్ముతా"నంటాడు హేతువాది.

ప్రకృతిలో మనకు తెలియని విషయాలు చాలా వున్నాయి. కాని నిన్న తెలియనివి నేడు, నేటివి రేపు తెలుసుకోగలం. కాని ఏ నాటికీ తెలియని అంశాలు లేవు. ఇది మన జీవితానుభవం. ఒకనాడు గ్రహమను కున్న చంద్రుడిపై కాలూని తిరిగి వచ్చాడు మానవుడు. అణువును ఛేదించాడు. తద్వారా వచ్చిన బ్రహ్మాండమైన శక్తిని వాడుకుంటూ పురోగ మిస్తున్నాం. తన పరిస్థితి బాగా లేనప్పుడు, తాను సుఖంగా లేనప్పుడు దానికి పురాకృత సుకృతంగా భావించడు హేతువాది. ఆ స్థితికి అనేక కారణాలున్నాయంటాడు. దీనికి ఎవరు, ఏశక్తులు, ఏవర్గాలు, ఏ సిద్ధాంతాలు ఏ భావాలు కారణభూతాలో ఆలోచిస్తాడు. అతనికలాంటి ఆలోచనాశక్తి వుంది. అంతేగాని ఏ మహాత్ముడో, గురువో, దేవుడో,నాయకుడో రక్షిస్తాడని, ఉద్ధరిస్తారని గుడ్డిగా నమ్మడు. వివేచనా శక్తిపై ఆధారపడతాడు. తోటి మానవులతో కలిసి పరిస్థితి మెరుగు పర్చుకోటానికి కృషి చేస్తాడు. ఆత్మ విశ్వాసంతో, పురుష ప్రయత్నంతో కార్యాచరణకు ఉపక్రమిస్తాడు. తన విజ్ఞానాన్ని సద్వినియోగ పర్చుకుంటాడు. అంతేకాని విధిపైననో, కాలచక్రం పైననో నెపం పెట్టడు. అతని బుద్ధే అతనికి ప్రమాణం. అతని అంతః ప్రవృత్తే అతనికి ప్రేరకం.

హేతువాది తన సుఖంతోపాటు ఇతరుల స్వేచ్ఛకై ఆరాటపడతాడు. ఆలా అతడు స్వేచ్ఛాపిపాసి అవుతాడు. శారీరక, మానసిక, భౌతిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంఘికబంధాలు అతన్ని చుట్టుముట్టినప్పుడు, అవి తనను ఎలాబంధించాయో, ఎలా విముక్తిని పొందగలడో ఆలోచిస్తాడు. ఆ ఆలోచనా శక్తి అతనికి పెట్టనికోట. అసలు బంధానికి కారణం తెలిశాక

విముక్తి పొందటం చాలా తేలిక. అలా అతను సత్యాన్వేషి అవుతాడు. అతని జ్ఞాన తృష్ణ అపారం. పరిస్థితులను గమనించి, మదింపు వేసి కర్తవ్యాన్ని నిర్ణయిస్తాడు. ఫలితాన్ని గూర్చి వ్యధ చెందడు. తన కార్యాచరణకు తానే బాధ్యతను స్వీకరిస్తాడు.

సమాజాన్ని అడ్డంగా, నిలువుగా చీలుస్తున్న కులమతాలకు, భాషా ప్రాంతీయాలకు అతీతుడు హేతువాది. విశ్వమానవ భావనవల్ల దురహంకారాన్ని, దుర్నీతిని, ప్రత్యక్షంగా అధిగమిస్తాడు. స్వయం ప్రబోధితమైన నీతితో జీవిస్తాడు. మనోవాక్కాయ కర్మల నమ్మిన సూత్రాన్ని పాటించి నిష్కల్మషుడవుతాడు. అందుకే హేతువాదం అందరికీ కావాలి. దుఃఖమూ, దోపిడీ, బాధా, ద్వేషమూ బాధించని వ్యక్తి సంపూర్ణ ఆనందంతో వుంటాడు తనకున్న దానితో తృప్తిపడి, తనకున్న శక్తితో పనిచేస్తాడు. అదే అద్వితీయానందం అందుకే హేతువాదం అవసరం.

ఎవరైతే సమాజ మూఢాచారాలకు, మతదురహంకారానికి, దైవభీతికి బలి అవుతున్నారో, ఎవరైతే వ్యక్తి స్వేచ్ఛను, మానవ వికాసాన్ని మత విధులవల్ల నష్టపోతున్నారో వారికి హేతువాద ఆలోచన రక్షణ నిస్తుంది.

నిజమైన హేతువాది తన కుటుంబసభ్యులను, భార్యను, స్నేహితులను, తల్లిని ఎవరిని ఎలా గౌరవించాలో అలా చూస్తాడు. కాని వారి మాటలను, ఆజ్ఞలను శిరసావహించడు. వారి వారి భావాలను ద్వేషించడు. పౌరుల జ్ఞాన సముపార్జనా శక్తికి దోహదం చేస్తాడు. బలహీన వర్గాల అభ్యున్నతికి చేయూత నిస్తాడు. మూఢ నమ్మకాల నివృత్తికై సామాజిక స్పృహతో పోరాడుతాడు. మాయా జడదారులను, బాబాలను, అమ్మలను బట్టబయలు చేయటానికి పాటుపడతాడు. పితృదేవతలకు తర్పణం దేవుడు, దయ్యం లాంటి గుడ్డి విశ్వాసాలను పారద్రోలుట, జంతుబలులు, యజ్ఞాల లాంటి వాటిపై ధ్వజమెత్తుట, ఆస్తి నష్టం, ప్రాణనష్టం లాంటి సమయాల్లో వ్యక్తుల నాదుకొని వారిలో శాస్త్రీయ దృక్పథాన్ని నెలకొల్పాలనే ప్రగాఢ వాంఛ అతని కుంటాయి. దుఃఖానికి, కష్టానికి నిలబడగల ధైర్య స్థయిర్యాలను బాధితులకు బోధించుట, ఇలా ఎన్నో రకాలుగా ప్రజలకుతోడ్పడ గలడు. అతను భావప్రసారశీలి మాత్రమేకాదు. కార్యశీలి, కార్యవాది. అతని

భావం, వాక్యం, రూపం, చేష్టలు అన్నింటికి సమన్వయం వుంటుంది. కడదాకా ఆశాజీవి, పరోపకారి, విజ్ఞానాన్వేషిగా, సుఖ దుఃఖాల కతీతుడుగా బ్రతుకుతాడు. అందుకే అందరికీ హేతువాదం అవసరం అయింది. ఏనాటి కైనా ఆలోచనల ద్వారా సుఖశాంతుల్ని, ఆనందజీవితానికి మార్గంచూపేది హేతువాదం అనక తప్పదు.

---

# తల్లుల్లో వైజ్ఞానిక దృక్పథం

"ఏ పిట్టకూత ఆ పిట్టకూస్తుంది" అన్నట్లు తల్లివల్ల పిల్లా, తల్లివల్ల కటుంబమూ, తద్వారా సమాజం ప్రభావితం చెందుతాయి. మన సమాజం మతాల పుట్ట. అంతేకాదు హిందూమతంలో అనేక కులాలు వున్నాయి. ఏ ఒక్క మతమూ రెండోదాన్ని సహించలేని ఈర్ష్యా అసూయలు అసలు మతావిర్భావంలోనే వున్నాయి. హిందూమతం మ్లేచ్ఛ్యులని, ఇస్లాం 'కాఫిర్లని' క్రైస్తవం "హీధెన్సు"అని అన్యమతస్తులను అధిక్షేపిస్తూవుంటాయి. ఇలా విభిన్న మత సిద్ధాంతాలున్న వేర్వేరు మతాల స్త్రీలను ఐక్యతగా వుండమనడం అసాధ్యంగా కన్పడినా దుస్సాధ్యం మాత్రం కాదు. తల్లుల్లో ఐక్యత ఎందుకు ? అని ప్రశ్నిస్తే వైజ్ఞానిక దృక్పథం కోసం అనేది సమాధానం అవుతుంది. కనుక వైజ్ఞానిక దృక్పథం అంటే ఏమిటి? దాని వల్ల మనకు లాభించేదేమిటి? అనే విషయాల వివరణ అవసరమయింది.

ఈ ప్రపంచానికి సృష్టికర్త లేడని, ప్రకృతి తనకు తానే తయారయిందని, ప్రకృతిలోని ప్రతి విషయం హేతువు ప్రకారం జరుగుతుందని నిర్వచిస్తుంది హేతువాదం. మన కళ్ళ ఎదుటే 'బేక్టీరియా' పుట్టినట్లు ప్రకృతి పరిణామ దశలో ప్రాణి ఉద్భవించిందేకాని సృష్టింపబడలేదు. హేతువాదమంటే అది ఒక ఆలోచనా విధానం. సత్యాన్ని అన్వేషించడమే దాని ప్రధాన లక్ష్యం. ఎందుకు? ఏమిటి? అంటూ ప్రతి విషయాన్ని ప్రశ్నించుకోవడం, ఆలోచించడం, సమాధాన పడడం దాని ప్రత్యేక లక్షణం. ప్రతి అంశాన్ని తర్కబద్ధంగా ఆలోచించి అనుభవంలో నిలిచిన దాన్నే నమ్ముతుంది. వేదాలు, బైబిలు, ఖురాన్‌లను నమ్మమంటుంది మతం. సైన్సు క్రొత్త విషయాలను అన్వేషిస్తుంది; ప్రశ్నిస్తుంది; పరీక్షిస్తుంది; ఆలోచింప జేస్తుంది. అతీత శక్తి వుందని, అది ఈ ప్రపంచాన్ని నడుపుతుందని మతంనమ్మి అంతటితో ఆగిపోయింది. ఆ శక్తిని ఎవరు సృష్టించారని ప్రశ్నిస్తే దాని పునాది కదులుతుంది. సైన్సు అలాకాదు. న్యూటన్ సిద్ధాంతమైనా పరీక్షిస్తాం. ఆ ప్రయోగాన్ని లేబరేటరిలో పరిశోధించినతర్వాతే నమ్ముతాం. ప్రకృతి స్వయం చలనశక్తిని త్రోసేసి అక్కడ

దేవుణ్ణి ప్రతిష్టించి మానవుణ్ణి దాసోహం చేయిస్తుంది మతం. తనభవిష్యత్తుకు తాను కర్త కాడంటూ వ్యక్తిని నిర్వీర్యుణ్ణి చేస్తుందిమతం. దానికి అసహనం మెండు. నిరసిస్తే హతమారుస్తుంది. బ్రూనో, గెలీలియో లాంటి శాస్త్రజ్ఞులను బలికొన్నది సహించలేక. మతదృష్టిలో కర్మానుసారం తనపాత్రను నిర్వర్తించటానికే జన్మపరంపర నిర్దేశింప బడింది. ఇలా అనేక విధాలవ్యక్తి స్వేచ్ఛనూ, సమానత్వాన్ని, ఆలోచనను ధ్వంసం చేసింది మతం.

తల్లుల్లో శాస్త్రీయ దృక్పథం లేనందువల్ల నష్టమేమిటి? అని ఆలోచిస్తే కుటుంబానికి, దేశానికి సమాజానికి ముఖ్యంగా పిల్లలకు తీరని నష్టమనేది నగ్నసత్యం. పిల్లలను ఆరోగ్యవంతంగా పెంచలేరు. పిల్లల్లో దయ్యాలు, భూతాలయెడ నమ్మకం కలిగించి వారికి మానసికాందోళన కలిగిస్తారు. కుల తత్వాన్ని, మత దురహంకారాన్ని జాతీయ దురభిమానాన్ని, భాషా భేషజాన్ని కలుగజేసి పిల్లల మానసిక పరిపక్వతకు అడ్డుపడతారు. అంధ విశ్వాసాన్ని పెంపుచేసి పిల్లల్లో సత్యాన్వేషణాసక్తిని, విచక్షణా జ్ఞానాన్ని కుంటుపరుస్తారు. పిల్లల చదువు గురించి శ్రద్ధవహించరు. ముఖ్యంగా స్త్రీ విద్యను వ్యతిరేకిస్తారు. స్త్రీలకంటే పురుషులు అధికులని చిన్ననాటనే నూరిపోసి స్త్రీల న్యూనతాభావానికి, పురుష దురహంకారానికి ప్రోదిచేస్తారు. ఇంకా ముఖ్యమైనది, పిల్లల్ని బెదరించటానికి "మీ నాన్నగారితోచెప్తాను" అని పిల్లల్ని హడలగొట్టి తద్వారా పురుషాధిక్యతా భావాన్ని పిల్లల మనస్సుల్లో నాటుతారు. ఇలా ఇంకెన్నో విధాల పిల్లల మానసిక పరిణతికి, అభ్యుదయానికి అడ్డుపడతారు.

పిల్లల్లో వైజ్ఞానిక దృక్పథం అలవడడానికి తల్లుల మానసిక వైఖరి మారాలి. ఆమె సర్వం సహాధికారం కల్గివుండాలి. ఏ వ్యక్తినీ, ఏ గ్రంథాన్ని ఏ సిద్ధాంతాన్ని ప్రామాణికంగా స్వీకరించరాదు. ఏ ప్రవక్తో ఉపదేశం చాడని, ఏగ్రంథమో నిర్వచించిందనికాని విశ్వసించరాదు. ప్రతివిషయాన్ని పరిశీలించాలి; ఆలోచించాలి; నిర్ణయించాలి; అమలు పర్చాలి. ఇలాంటి శాస్త్రీయ విజ్ఞానంపై విశ్వాసంతో జీవితాన్ని గడపాలి. వ్యక్తికి ఆలోచన వుంది; మేధస్సువుంది. ఆ మేధస్సుకు ప్రత్యేకమైన లక్షణం వుంది. కాని ఆధునిక విద్యనేర్చిన వారిలో, పెద్దపెద్ద డిగ్రీలున్న వారిలో సైతం

శాస్త్రీయ దృక్పథం కొరవడి మతకబంధ హస్తాలలో కట్టుబడి స్వేచ్ఛను కోల్పోతున్నారు. కనుక స్త్రీలలో శాస్త్రీయ జ్ఞానాన్ని కలిగించటానికి హేతువాదులు సూత్రధారులు కావాలి. వారు స్త్రీ జనోద్ధరణ తమ ముఖ్య కార్యక్రమంగా భావించాలి.

తల్లులు చేపట్టాల్సిన కార్యక్రమాలలో మున్ముందుగా తమ శరీర నిర్మాణాన్ని గురించి, ఆరోగ్యాన్ని గురించి తెలుసుకోవాలి. తగిన విద్య సముపార్జించాలి. విద్య అంటే డిగ్రీల చదువు మాత్రమే కాదు. మనిషిలోని వ్యక్తి వికాసానికి దోహదంచేసి, ఆ వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యాలను వెలికితీసి వినియోగించుకో గలిగేదే విద్య. దానికి వయస్సుతో పనిలేదు. ఫలాని వృత్తి చేసేవారే చదవాలని లేదు. ఇది సర్వులకు పనికి వచ్చేది. విచక్షణా జ్ఞానాన్ని, వివేకాన్ని పెంపొందించు కోవడం మరో ముఖ్యమైన అంశం. ఈనాటి గ్రంథాలలో వైజ్ఞానికవాదానికి బదులు భావవాదాన్ని వ్యాప్తి చేస్తున్నారు. కొన్ని స్వచ్ఛంద సంస్థలూ, ప్రభుత్వమూ కూడా ఈ సిద్ధాంతాలను బలపరుస్తున్నాయి. లౌకిక రాజ్యమని ప్రకటించుకొనే మన దేశంలో ఇలా జరగడం శోచనీయం. సనాతనులు, సంఘ సంస్కర్తలలో కొందరు సైతం స్త్రీలలో విజ్ఞాన వ్యాప్తికై పోరాడరు. కనుక ఇది హేతువాదులకు ముఖ్య కర్తవ్యమయింది. ఏ మార్పు చేయాలన్నా, ఏ దుర్నీతిని పోగొట్టాలన్నా శాస్త్రీయ అవగాహన ఉండాలి. ఎన్ని అవాంతరాలొచ్చినా, మరెన్ని ఆటంకాలున్నా తల్లుల్లో వైజ్ఞానిక భావ స్థాపన జరక్కపోతే స్త్రీ జాతికి ముక్తిలేదు; దేశానికి అభ్యుదయంరాదు. ఈ అంశాన్ని చైతన్య స్ఫూర్తిగల ప్రజలు గుర్తించ గలిగిననాడే మనసమాజమూ, భావిపౌరులూ ప్రగతిపథంలో పయనించ గలరు. ఎప్పుడైతే నారీలోకం భావదాస్యాన్ని అధిగమిస్తుందో ఆనాడే పిల్లలకు, తండ్రులకు విముక్తి కలిగి ప్రగతిపథాన పయనించగలం.

# వికాస సాహిత్యం

| | | |
|---|---|---|
| ఎం. ఎన్. రాయ్. జీవితము, సిద్ధాంతము | | రు. పై. |
| | కోగంటి రాధాకృష్ణమూర్తి | 25—00 |
| ఫాసిజం : ఎం. ఎన్. రాయ్ | అ॥ రావిపూడి | 7—00 |
| నవ్యమానవవాదం ,, | అ॥ ఎ. జి. కె. & ఎం. వి. ఆర్ | 6—00 |
| కమ్యూనిజానికి అవతల ,, | అ॥ ఎం. వి. రామమూర్తి | 10—00 |
| మానవ నాగరికత ,, | అ॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు | 8—00 |
| నాస్తికత్వం : వాస్తితత్వం | రావిపూడి వెంకటాద్రి | 12—00 |
| హేతువాదం అంటే | ఎం. వి. రామమూర్తి | 4—00 |
| ఎమర్జెన్సీలో జైలు అనుభవాలు | ,, | 3—00 |
| గాంధీ మార్గం | కోగంటి రాధాకృష్ణమూర్తి | 12—00 |
| మనం దేనికి బానిసలం ? | మల్లాది సుబ్బమ్మ | 3—50 |
| తల్లే పిల్లను చంపితే ? | ,, | 3—50 |
| విముక్తి ఉద్యమాలు : మహనీయులు | ,, | 3—50 |
| ఆధునిక స్త్రీ | ,, | 12—00 |
| ఓ మహిళా ! ముందుకు సాగిపో | ,, | 7—00 |
| మారుతున్న సమాజం : మహిళలు | ,, | 5—00 |
| మహిళాభ్యుదయం | ,, | 15—00 |
| మహిళా దశాబ్దం | ,, | 7—50 |
| మహిళాభ్యుదయం (మొదటిభాగం) | ,, | 7—50 |
| వెలిగిన జ్యోతి | ,, | 12—00 |
| మాతృత్వానికి మరోముడి | ,, | 20—00 |
| శాస్త్రీయ దృక్పథం - ఎ. బి. షా | అ॥ ఎన్. ఇన్నయ్య | 4—00 |
| ఎం.ఎన్.రాయ్. భారత కమ్యూనిజం | -రావిపూడి వెంకటాద్రి | 45—00 |
| రాడికల్ హ్యూమనిజం | ,, | 7—00 |
| మహామనిషి : ఎం. ఎన్. రాయ్ | కొల్లా సుబ్బారావు | 8—00 |
| సెక్యులరిజం | పి. సత్యనారాయణ | 3—00 |
| హేతువాదం | రావిపూడి వెంకటాద్రి | 4—00 |
| హేతువాద ఉద్యమచరిత్ర | & మల్లాది సుబ్బమ్మ ఎం.వి.ఆర్. | 2—00 |

ప్రతులకు : **వికాసం**

9 ఎం. ఐ. జి. హెచ్. కాలనీ మెహిదీపట్నం, హైదరాబాదు - 500 028

వి. పి. ద్వారా కావలసినవారు అడ్వాన్సు పంపాలి. ఫోను 31423.